# THE
# ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY DEBATES.

*[Part II—Proceedings other than Questions and Answers]*

OFFICIAL REPORT.

---

*Thirty-third day of the Sixth Session of the Andhra Pradesh Legislative Assembly.*

---

## ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY.

*Friday, the 28th February, 1958.*

The House met at Two of the Clock.

*[Mr. Speaker in the chair]*

## QUESTIONS AND ANSWERS.

(See Part I)

### Report of the Village Officers Enquiry Committee

రివెన్యూ మంత్రి (శ్రీ కె వెంకటరావు):—అధ్యక్షా, గ్రామోద్యోగుల విచారణ సంఘము యొక్క నివేదికను మేజాపై వుంచుతున్నాను.

*Mr. Speaker:* Paper laid On the Table of the House.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య (సత్తెనపల్లి) :—అధ్యక్షా, మంత్రిగారు ఇచ్చిన రిపోర్టు పై ప్రత్యేకంగా చర్చకు అవకాశం ఇస్తారా ?

శ్రీ కె. వెంకటరావు:—చర్చ అనవసరము. అందుచే అవకాశమును ఇవ్వను.

మిస్టర్ స్పీకర్:—సభ్యులు కోరితే, మంత్రివర్గానికి, ముఖ్య మంత్రిగారికి చెబితే, ఆ సందర్భాన్ని బట్టి ఆలోచిస్తాము. ముందు మీరు వ్రాయండి.

శ్రీ కె. వెంకటరావు:—మన ఎదుట బడ్జెటువుంది. ఏమైనా 1, 2 Points వుంటే అప్పుడు చెబితే Reply ఇస్తాను.

మిస్టర్ స్పీకర్:—బడ్జెటు అయ్యే వరకు చర్చకు అవకాశం ఇవ్వను.

శ్రీ కె. వెంకటరావు:—అప్పటికి అన్ని పనులు పూర్తి అవుతాయి.

శ్రీ గోపిడి గంగారెడ్డి (ముధోలు) :—అధ్యక్షా, ఈ రిపోర్టు తెలుగులో కావాలండి.

మిస్టర్ స్పీకర్:—తెలుగులో క్రమంగా వస్తాయి.

శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్య:—అధ్యక్షా, మీద్వారా మంత్రివర్గమును కోరుతున్నాను వారిని ఆలోచించి చెప్పమనండి.

మిస్టర్ స్పీకర్:—బడ్జెటు కాలములో లేదు. బడ్జెటు తరువాత చూద్దాము. ముఖ్యమైన విషయం కనుక వారితో మాట్లాడదాము.

శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్య:—అట్లాగే.

## Business of the House

శ్రీ పి. రామాచార్లు (ధర్మవరం—జనరల్).—అధ్యక్షా, ఈ సభ రేపు ఉదయమున సమావేశమవుతుందా ? లేక సాయంకాలమా ?

మిస్టర్ స్పీకర్:—రేపటినుండి ఉదయము సమావేశమవుదామని ముందు నిర్ణయించాము. కాని ముఖ్య మంత్రిగారికి . . . . . . .

ముఖ్య మంత్రి (శ్రీ ఎన్. సంజీవరెడ్డి):— అధ్యక్షా, ఉదయం సమావేశం కావాలని ముందే నిర్ణయించాము కనుక మా ప్రోగ్రాము సాయంకాలానికి మార్చుకొన్నాము. అందుచేత ప్రకటించినట్లుగా ఉదయమే సమావేశమవుదాము. ఆ సంగతే వెంకటేశ్వర్లుగారికి చెప్పాము.

మిస్టర్ స్పీకర్.— రేపటినుండి ఉదయం $8\frac{1}{2}$ నుండి $1\frac{1}{2}$ వరకు, సమావేశమవుదాము. మార్చి ఆఖరి వరకు అట్లాగే జరుగుతుంది.

## Discussion on Arrest of the Employes of the Etikoopaka Sugar Mills

ఏటికొప్పాక పంచదార ఫ్యాక్టరీలోని కొంత మంది కార్మికులను అరెస్టు చేశారనే విషయముపై రూల్ 70 క్రింద ఒక గంటసేపు చర్చించటానికి అవకాశం ఇచ్చాను. దీనిపై డిబేటు, ఓటింగ్ లేదు. 10 నిమిషం కొక సభ్యుడు ప్రకారం మాట్లాడండి. 20 నిమిషములు మంత్రిగారు మాట్లాడుతారు. ముందు కమ్యూనిస్టు పార్టి తరపున ఒకరు మాట్లాడండి.

శ్రీ పి. రామాచార్లు:—అనంతపురం బస్ accident గురించి చెబుతారా ?

మిస్టర్ స్పీకర్:—అది ఒకటవ తేదీకి వేశాను.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు (నందిగామ) :—అధ్యక్షా, ఈసమ్మె జరుగుతున్నదనే విషయం ప్రభుత్వ దృష్టికి వచ్చిందని అనుకొంటున్నాను. ఆ ఫ్యాక్టరీలో షుమారు 600 కార్మికులు పని చేస్తున్నారు. ఈ సమ్మె సందర్భములో 2, 3 వందల మందిని అరెస్టు చేశారు. శాంతియుతంగా సమ్మె చేస్తున్న వీరిని అరెస్టు చేసి సబ్ జైలు చాలకపోతే సెంట్రల్ జైలుకు పంపిస్తున్నారు. ఈ వ్యవహారము జరగటానికి గల కారణాలను మంత్రివర్గ దృష్టికి తీసుకు రావలసిన అవసరం వుంది.

హఠాత్తుగా, ప్రభుత్వానికి కాని, యజమానులకు కాని, నోటీసులు ఇవ్వకుండా కాలవ్యవధి లేకుండా సమ్మె చేస్తుంటే పరిస్థితి వేరుగా వుండేది.
కాని, ఎన్నో సంవత్సరాలనుండి ఈ సమస్య Pending గా వుంది వారు 10-9-1957 న సమ్మె నోటీసు ఇచ్చారు. అప్పుడు జనరల్ శెక్రటరీగా పని చేస్తున్నవారు, ఎన్నికలలో పోటీ చేస్తున్నప్పుడు సెలవుకు apply చేశారు. సెలవు ఇవ్వకుండా అతనిని పనిలోనుండి డిస్మిస్ చేశారు. బోనస్ కావాలని, సీనియారిటీలు, ప్రమోషనులు సరిగా పరిగణించాలని వీరు యజమానులను కోరారు. అలా విజ్ఞప్తులు పంపుకొన్న వాటిని వారు ఖాతరు చేయలేదు. దీనిని ట్రిబ్యునల్‌కు రిఫర్‌చేయటానికి పూనుకోలేదు. 5, 6 నెలల తరువాత 24-1-55 న సమ్మె నోటీసు ఇవ్వటం జరిగింది. ఈ నోటీసుకు పూర్వమే 11-1-55 న ప్రభుత్వానికి వారి కోర్కెలను తెలియ జేస్తూ ఒక మెమోరాండమును ఇచ్చారు. సమ్మె నోటీసులోను, మెమోరాండములోను గల ముఖ్య విషయాల గురించే ఇప్పుడు చెప్పబోతున్నాను. 1 అనవసరముగా, అకారణముగా, ఆఫీస్ బేరర్‌గాను, యూనియన్ బాధ్యత వహించి దానిని నడుపుతున్న వారిని డిస్మిస్ చేస్తూ జారీ చేసిన ఉత్తరువును రద్దుచేసి పనిలో తిరిగి చేర్చుకోవాలని వారి మొదటి కోర్కె. 2. Payment of bonus గురించి. 1953-1954, 1954-55, 1955-1956 ఈ మూడు సంవత్సరాలకు బోనస్ ఇవ్వాలని వారి రెండవ కోర్కె. 3. ప్రమోషన్స్ లోని సీనియారిటీని గుర్తించాలనేది మూడవ కోర్కె బోనస్ విషయంలో adjudication కు Refer చేయమని చెప్పినట్లుగా ప్రశ్నల కాలములో మంత్రిగారు చెప్పారు.

ఈ బోనస్‌కు సంబంధించిన విషయములో ఒక మోసం వుంది. 1953—54, 1954—55 సంవత్సరములలో చాలా తక్కువ లాభం వచ్చింది, 60 వేలు మాత్రమే వచ్చింది కనుక ఇవ్వ లేమని డిపార్టుమెంటువారు తెలిపారు. 1955—56 లో షుమారు 4,48,000 లాభం వస్తే ఆ సంవత్సరం బోనస్ ఇవ్వాలా? అక్కర లేదా అనేది adjudication వారిని refer చేయమని చెప్ప టానికి మారుగా, 1953—1954, 1954—1955 సంవత్సరాలలో బోనస్ ఇవ్వాలో, అక్కర లేదో refer చేయండని adjudication వారికి ప్రభుత్వపు తరపున ఉద్యోగులు సూచించటం సరైన పద్ధతి కాదని మాత్రమే నేను విజ్ఞప్తి చేస్తున్నాను. ఇప్పుడు ఈ సమస్యను adjudication కు refer చేశాము కనుక, సమ్మె చేసినట్లయితే చట్ట విరుద్ధమైనదిగా పరిగణించవలసివస్తుందని అంటున్నారు. అసలు refer చేసినది ఏమిటి ? బోనసును గురించి అయినా పూర్తిగా refer చేయ లేదు. అందులో అనేక డిమాండ్సు, జోలికి అయినా పోలేదు. ఆ చక్కర ఫ్యాక్టరీ assets ను తప్పకుండా adjudication కు refer చేసి యుండవలసినది. కాని అలా చేయక పోవడము, ప్రధానమైన లోటుగా ప్రభుత్వ దృష్టికి నేను తీసుకొని వస్తున్నాను. అనేక items, అనేక Demands ఉన్నప్పుడు, ఏదో ఒకటి రెంటిని మాత్రమే adjudication కు పంపి, అయిపోయినదంటే అది ఎంత మాత్రం ఆమోదించదగిన విషయం కాదు. ఆ విధముగా సమ్మె చట్టబద్ధమైనది కాదని, లేబరు డిపారు మెంటు ప్రకటిస్తోననడము హర్షించ దగినది కాదు.

ఏ డిపార్టుమెంటు వలన తమ హక్కులు కాపాడబడతవని కార్మికులు ఆశిస్తున్నారో, ఆ లేబరు డిపార్టుమెంటు, నేడు యజమానులకు తాజేదారుగా తయారు అవుతోంది. ఇది చాలా దారుణమైన పరి స్థితి. అసలు ఈ ప్రభుత్వ హయాములో నిజమైన రక్షణ అంటూ ఉంటుందాన్న అనుమానము కూడా

నేడు కార్మిక లోకంలో ఉన్నది. ఈ విషయాన్ని గ్రహించమని, ప్రభుత్వాన్ని కోరుతున్నాను. అంతేకాదు. Dismissal వ్యవహారం తీసుకొండి. అనేక మంది కార్మికులను, అనవసరంగా, అక్రమంగా ఉద్యోగాల నుంచి తొలగిస్తున్నారు అందులో న్యాయమైన కేసులను లేబరు కోర్టులకు refer చేయుటకు ప్రభుత్వానికి అధికారం ఉంది కాని ఈ విషయంలో ప్రభుత్వం ఏ మాత్రం పట్టించుకోవడం లేదు. ఈ అక్రమ Dismissals ను Labour Conciliation Officer కు గాని, లేక Labour Cmmissioner కు గాని, లేబరు కోర్టుకుగాని, పంపకపోతే అవి ఉండి లాభము ఏమిటి ? ఈ రోజున కార్మికులు కోరేకనీసపు కోర్కెలు, రెండేరెండు. తమ హక్కులు, డిమాండ్సురక్షణకై adjudicationకు పంపమంటున్నారు. రెండవది, Dismissal వ్యవహారం వచ్చినప్పుడు Labour Courts కు refer చెయ్యమంటున్నారు ప్రభుత్వం ఏర్పాటు చేసినటువంటి, ప్రభుత్వంచే నియమింపబడి నటువంటి లేబరు ట్రిబునల్స్ యిచ్చే తీర్పులకు బద్దులమై ఉంటామని, నెత్తిననోరు పెట్టుకొని చెప్పకుంటున్నప్పటికి వినేవారు లేక పోతున్నారు. ఉయ్యూరు ఫ్యాక్టరీలో కూడ అన్యాయంగా కార్మికులను తొలగించారు. అక్కడ కార్మికులు కూడా యిదే కోరుతున్నారు ఈ మధ్య కొన్ని చోట్ల, యజమానులు కార్మికులతో agreements కు వచ్చి, ఆ agreements ను Violate చేస్తున్నారు. ఈ విధముగా యూనియన్స్‌ను నాశనము చేయాలనే దుర్బుద్ధితో యజమానులు, ప్రవర్తిసు ంటే, కార్మికులకు లేబరు డిపార్టుమెంటు తప్ప, రక్షణ యిచ్చేవారు ఎవరున్నారు ? లేబరు మంత్రిగారికి సానుభూతితో ఉన్నదని నాకు తెలుసు. ఈ ఏటికొప్పాక విషయం ఆలోచించండి. 1953--54 సంవత్సరాలలో వరుసగా 66 వేలు, 63 వేలు, లాభం వస్తే, ఈ లాభాల సంగతి adjudication కు refer చేసేందుకు ఒప్పుకొన్నారు. నాలుగు లక్షల నలుబది ఎనిమిది వేల రూపాయలు లాభం వచ్చిన 1955—56 సంవత్సరం, బోనసు విషయం refer చేయ మంటే యజమానులు మాట్లాడడం లేదు. అక్కడ కార్మికులు కోరిన, కనీసపు కోర్కె, 1955—56 సంవత్సరం బోనస్ విషయం adjudication కు పంపమని. ఈ కనీసపు కోర్కెకు లేబరు డిపార్టుమెంటు సానుభూతి, చూపక పోతే, కార్మికుల గతి ఏమిటి ? అందుచేత తిరిగి మరొకసారి ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నాను. వారి యొక్క కనీసపు కోర్కెల విషయం పునరాలోచించి, అక్కడ కార్మికులకు, న్యాయం కలుగ జేయాలని మనవి చేస్తూ విరమిస్తున్నాను

శ్రీ బి. శ్రీరామమూర్తి (విజయనగరం) :— అధ్యక్షా, ఈ రోజున ప్రభుత్వ విధానాన్ని విమర్శించడమే కాకుండా, ప్రభుత్వానికి, కార్మికులను అక్రమంగా తొలగించడమనే విషయంపై ఒక విజ్ఞప్తి కూడ చేయ దలచుకొన్నాను. ఏటికొప్పాకలో సమ్మె ప్రారంభమై 21 రోజులు అయింది. వంద లాది కార్మికులు సమ్మెలో యిమిడి ఉన్నారు. ప్రభుత్వానికి చీమ కుట్టినట్లు కనుపించదు. సమ్మె ప్రారంభించక పోతే కార్మికులకు మార్గం లేదు. అందుకొరకు సమ్మె ప్రారంభించారు. సమ్మె విరమిస్తేనేగాని ప్రభుత్వం మాట్లాడనంటోంది. అసలు మొదట్లో ప్రభుత్వము మాట్లాడ లేదు కనుకనే, సమ్మె తప్ప వేరే దారి లేక పోయింది. ఈ విధంగా ప్రభుత్వం సమ్మె చేసే హక్కు కార్మికులకు లేకుండా చేయాలని ఉద్దేశిస్తున్నదా యని ప్రభుత్వాన్ని అడుగుతున్నాను. ఎప్పుడో 10—9—57 తేదీన ఈ సమ్మెకు నోటీసు ఇచ్చారు. అప్పుడు లేబరు డిపార్టుమెంటు హామీ యిస్తే ఆ నోటీసును విరమించుకొన్నారు. కాని లేబరు డిపార్టుమెంటు కార్మికులకు ఒకటి చెప్పి, ప్రభుత్వానికి యింకొక రిపోర్టు పంపినది. కార్మికులతో, మీ Demands అన్నిటిని కోర్టుకు పంపుతామని చెప్పి, దానికి వ్యతిరేకంగా యింకొక రిపోర్టు ప్రభుత్వానికి

పంపడంలో గల ఉద్దేశ్యం ఏమిటి ? ఈ రకమైన సాంప్రదాయం ప్రభుత్వం ఎందుకు అమలులో ఉంచినదో నాకు అర్థం కాకుండ యున్నది. కార్మికులు ఈ నాడు కోరుతున్న కనీసపు కోర్కె ఏమిటి ? న్యాయంగా వారికి రావలసిన దానిని, రాబట్టుకొనుటకు, వారియొక్క డిమాండ్సును కోర్టుకు పంపమంటున్నారు ట్రిబ్యునల్సుకు పంపమని కోరుతున్నారు. అది ఎందుకు చేయకూడదు ? ఆలోచించినట్లయితే ఈ సమ్మె ప్రభుత్వానికి వ్యతిరేకంగా జరుగుతున్నదేకాని, మేనేజిమెంటుకు వ్యతిరేకంగా, కాదని నేను అభిప్రాయ పడుతున్నాను. మేనేజిమెంటుకు, కార్మికులకు తగవు వచ్చి , అది పరిష్కారము కాక పోయినట్లయితే ప్రభుత్వం వెంటనే కల్పించుకొని, పరిష్కారం చేయుటకు పూనుకోవాలి. అందులోనూ, యిది కోపరేటివ్ సొసైటీకి సంబంధించిన వ్యవహారం. ఇక్కడ ప్రభుత్వం ఒక ఆదర్శ ప్రాయమైన సంబంధం, కార్మికుల, మేనేజిమెంటు మధ్య నెలకొల్పవలసిన అవుసరం ఉంది. ఈ నాడు ప్రభుత్వ దృక్పథం ఎలాగ ఉన్నదంటే, యేదైనా సమస్యను పరిష్కరించమని కోరితే, అది చాలా పెద్ద సమస్య, దానిని కోర్టుకు పంపినట్లయితే తొందరగా తెగదు, అట్లా కోర్టుకు పంపుటకు వీలు లేదు అంటున్నది. ఆ విషయమే చిన్నదైన, యిది చాలా బహు స్వల్పమైన విషయం, దీనిని ఎప్పుడైనా మనం పరిష్కరించుకోవచ్చును అంటోంది. ఈ విధముగా సమస్యలను, పరిష్కరించ కుండానే ప్రభుత్వం తప్పుకుంటోంది. ఈ కార్మికులు కోరేదిబోనసు. ఆ బోనసు సమస్యను మేనేజిమెంటు పరిష్కరించక పోతే, ప్రభుత్వం కలుగ జేసుకొని పరిష్కరించాలి ఈ నాడు అక్కడ మేనేజిమెంటు చేసినదేమిటంటే, 4 లక్షల 43 వేల రూపాయలు లాభం వచ్చిన సంవత్సరం లెక్కలు కోర్టుకు పంపక, అంతకన్నా బాగా తక్కువ లాభాలువచ్చిన, సంవత్సరాలది కోర్టుకు పంపుతోంది. ఇది చాలా అన్యాయం అని, అడుగుతే యిప్పుడు పంపుతున్నాం అంటున్నారు. అంతే కాకుండా Dismissalచేసిన కార్మికులను తిరిగిచేర్చుకోమని ఉత్తరువు చేసినట్లు ప్రభుత్వం చెప్పింది అప్పుడే నెల అయినదే ! ఆ సూచనను యింత వరకు అమలు జరుప లేదు. అసలు ఈ తగవు గౌతు లచ్చన్న గారు మంత్రిగా ఉన్నప్పుడు వచ్చింది. తరువాత వి. బి. రాజుగారు కార్మిక మంత్రిగా వచ్చారు. ఇప్పుడు .సంజీవయ్యగారు ఉంటున్నారు కార్మిక మంత్రిగా ! ఇంత కాలంనుంచి ఈ సమస్యను పరిష్కరించకుండా భవిష్యత్తుకు వదలి వేశారు. ఇది కార్మికుల పాలిట జీవన్మరణ సమస్య. దీనిని యిట్లా అపరిష్కృతంగా ఉంచుటఅనుచితము ఈ sugar factory Public utility Concern క్రిందఉంది.వాళ్ల strike illegal అనడానికి వీలులేదు. శక్షన్ (2) క్రింద strike notice యిచ్చారు.

"The appropriate Government shall, unless it considers that the notice has been frivolously or vexatiously given, or that it would be inexpedient so to do, make a reference under this sub-section not with standing that any other proceedings under this Act in respect of the disputes may have commenced.'

ఇందులో inexpedient అని ఉంది. ఇది ఏ రకంగా inexpdient. ఇందులో ప్రెసిడెంటు, శక్రటరీ, ట్రెజరరు, జాయింటు శక్రటరీ ఉన్నారు. ప్రసిడెంటు employee కాదు. తక్కిన ముగ్గురిని Dismiss చేశారు. ఈ విధముగా వారు అడిగిన సామాన్య కోరికలనుకూడ, పరిష్కరించడానికి వీలు లేకుండా చేస్తున్నారు. వాళ్ల కోర్టుకు Refer చేయమన్నారు. అదీ చేయలేదు. సెక్షన్ 12(5) లో స్పష్టముగా ఇలాఉంది.

"If on a consideration of the report referred to in sub-soction (4), the appropriate Government is satisfied that there is a case for reference to the Board or Tribunal, it may make such a reference. Where the appropriate Government does not make such reference, it shall record and communicate to the parties concerned its reasons therefor.'

ఈ రకమైన reasons ఏవైనా ప్రభుత్వానికి తెలియ పరిచారా అని అడుగుతున్నాను. ఇప్పుడు సాగిస్తున్న సమ్మె చట్టానికి ఎంత మాత్రం వ్యతిరేకం కాదని నేను సవాలు చేస్తున్నాను మద్రాస్ హైకోర్టులో ఇటువంటి కేసు వచ్చిన సందర్భంలో స్పష్టంగా ఈ విషయాన్ని తెలియ పరచారు. Press Labour union కు state Government of Madras కు మధ్య వచ్చిన తగాయిదాలో వారు స్పష్టంగా యిచ్చినతీర్పు వుంది అందులో వారు ఈ విధంగా అన్నారు.

'If a setelement could not be arrived at and the Government does not under section 12 (5) make a reference to the Board or Tribunal nor does it record its reasons and communicate them to the parties concerned, then the Government has failed to exercise its discretion and its action amounts to declining of jurisdiction '

అందుచేత ప్రభుత్వం చట్టానికి వ్యతిరేకంగ, కార్మికులను అణచి పెట్టడానికి ప్రయత్నిస్తున్నదని, యజమానులకు అనుకూలంగా సంచరిస్తున్నదని చెబుతున్నాను ఈరోజునతిరిగి వారుఆలోచన చెయ్యాలని కోరుతున్నాను. ఇంతేకాదు, యిందులో యింకో ముఖ్యమైన విషయం వుంది. కార్మికులు అయిదు demands పెట్టారు ఈ అయిదులోను

'illegal extraction of Khalasi work from the general mazdoors while actually khalasi designated workers are available'

అది ఒక రకమైన demand ఇంకొకటి

'Over looking of seniority, efficiency and suitability of fitters, maistries and other categories.'

ఈ రెండు demands మాట ప్రభుత్వం ఏమి చేసిందని అడుగుతున్నాను. అడిగినట్లయితే యివి చిన్న విషయాలు ఎప్పుడైనా settle అవుతాయని చెబుతున్నారు. చిన్న విషయాలైతే ఎందుకు settle చేయకూడదు.? ప్రభుత్వమేమి మాట్లాడదే? సమ్మె సమ్మె విరమించాలని చెబితే ప్రభుత్వానికి అది న్యాయం కాదు. కార్మికులకు సమ్మె తప్ప వేరే మార్గం లేక పోవుటచే, వారు సమ్మె చేస్తున్నారు. సమ్మె చేసిన తర్వాత దానిని పడగొట్టడానికి ప్రయత్నం చేస్తున్నారు. ఇది న్యాయంకాదు. ఈ రోజున dismiss చేయబడిన కార్మికులు 6 మొదలు 20 సంవత్సరాల వరకు service వున్నవారు. వారికి service లో యింతవరకు ఏ కారణంచేతనూ, ఏ విధమైన Black Mark కూడాలేదు Victimiseచెయ్యాలనే దురుద్దేశ్యంతో ఈ పనిచేసింది. కనీసం appeal చేసుకొనేఅధికారం వుండ వద్దా? అని అడుగుతున్నాను.

Dismiss చేసారు. Indicipline అని చెప్పారు ఎవరికిచెప్పకోవాలి? ఎవరికిappeal చేసుకోవా లని కార్మికులే అడుగుతున్నారు. వాళ్ళ case Industrial Tribunal కు పోనివ్వండి, అక్కడ వారు ఏమి మొర పెట్టుకుంటారో చూడండి న్యాయం తెప్పుకోనివ్వండి. ఇది కూడా లేకుండా ప్రభుత్వం చేసినట్లయితే, కార్మిక సంక్షేమానికి వ్యతిరేకంగా, కార్మికులను అణచి పెట్టడానికి, పూన కొన్న వ్యక్తులకు, అధికార్లకు ఈ రోజున ప్రభుత్వ పక్షంలో వున్న పెద్దలు భయపడుతున్నారని నేను స్పష్టంగా తెలియ చేస్తున్నాను అందుచేత ఈ రోజున ప్రభుత్వం గమనించ వలసినవి రెండే రెండు విష యాలు వున్నాయి. తమ jurisdiction ను ప్రభుత్వం వ్యతిరేకించింది. illegal గా ఈ సమ్మెను declare చేయడానికి వీల్లేదు. Public utility concern యిది. Alternative చూపించకూండా దీనిని illegalise చేయడానికి ప్రభుత్వానికి అవకాశం లేదని నేను స్పష్టంగా మనవి చేస్తున్నాను. ఏ కారణం చేత court కు refer చేయడం జరుగలేదో కనీసం వారికి(కార్మికులకు)తెలియపరచి ఉండవలసింది. చట్టంలో 12(5) సెక్షన్ ప్రకారం తెలియ పర్చ లేదు కాబట్టి దానిని వ్యతిరేకించింది ప్రభుత్వమేనని మనవి చేస్తున్నాను. ఈ నాటివరకు కోర్టుకు refer చేయక పోవడం అన్యాయం. లేబర్ కమిషనర్గారు ఒక worker ను తీసుకోమని చెప్ప మన్నారు. ఈ నాటి వరకు ఆ workerను గురించి ఏమి చేశారని అడుగుతున్నాను. ఇప్పటివరకూ తగవు ముదిరినా, విపరీతమైన పరిస్థితి వచ్చినా, కొన్ని వందల మంది సమ్మె చేస్తున్నప్పటికీ, కొన్ని వందల మంది జైలుకు వెళ్ళినప్పటికీ ప్రభుత్వం ఖాతర్ చేయలేదు ఇటువంటి పరిస్థితులు వున్నట్లయితే ఈ రోజున ఈ ప్రభుత్వాన్ని పేదల తాలూకు ప్రభుత్వం క్రింద , కార్మికుల తాలూకు ప్రభుత్వం క్రింద అన్న కోవడానికి వీల్లేదు. ఇది ప్రభుత్వం గమనించాలి, ఆలోచన చేయాలి. ప్రభుత్వానికి వ్యతిరేకంగా కార్మికులు యుద్ధం ప్రకటించారని, ఒక యుద్ధంగ సమ్మెను గమనించడానికి వీల్లేదని, కార్మిక సంఘం లో వున్న పేద ప్రజల తరపున తిరిగి వారికి విజ్ఞప్తి చేస్తున్నాను. కార్మికులకు సమ్మె తప్ప యింకో మార్గం లేదు. వారు దానిని illegalise చేశారు. కార్మికులు 5demands పెట్టారు. ఒక demand ను అంగీకరించారు. ఒక demand ను court కు refer చేస్తామన్నారు. "తక్కిన వాటి గురించి మాట్లాడకుండా నోరు మూసుకొని వూరుకోండి, లేకపోతే సమ్మె illegalise" అయిపోతుందంటే, అదిసరైన విధానం కాదు. అందుచేత ప్రభుత్వం తిరిగివిచారణ చెయ్యాలని, కోర్టుకుతక్షణం పంపించాలని కార్మికులకు వ్యతిరేకంగా వున్న ప్రభుత్వమని అనిపించుకోకుండా, తిరిగి వారందరికి ఉపకారం చేసే పద్ధతిలో వెళ్ళాలని విజ్ఞప్తి చేస్తూ సెలవు తీసుకొంటున్నాను.

శ్రీరాజసాగి సూర్యనారాయణ రాజా (నరసీపట్నం—జనరల్) :—అధ్యక్షా, నానియోజక వర్గానికి సంబంధించిన ఈ factory labour strike ను గురించి మాట్లాడుటకు నాకు అవకాశం యిచ్చినందుకు మీకు కృతజ్ఞతలర్పించుకొంటున్నాను. మొట్ట మొదట 1934 వ సంవత్సరంలో శ్రీ పి. వి. నర్సింహరాజుగారు మన ex-chairman of Madras Legislative council శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజుగారు 360 shares, 60 share-holders, 250 మంది కార్మికులు తోను ఒక చిన్న Societyగా ఈ factory ని ప్రారంభించారు. రోజుకు 250 మంది పనివారితో, 50 టన్నుల factory ప్రారంభించబడింది. share విలువ రూ. 125/ లు. 1942 వరకు యింత మంది తోటి పని జరిగింది. Collatral Security గా మొట్టమొదట కొప్పాక నర్సింహరాజుగారు,

ఆర్. యస్. సత్యనారాయణరాజుగారు (తంగేడు) వారి కుటుంబ తాలూకు ఆస్తినంతా యిచ్చి ఈ co-operative factory ని ప్రారంభించారు. 1950 లో పెద్ద factory register కాబడి, 1953 సంవత్సరంలో వ్యాపారం ప్రారంభించబడింది. 1764 మంది Share-holdres, రమారమి 10 వేల shares, share విలువ Rs. 125/- తో ఈ factory 1953వ సంవత్సరంలో పని ప్రారంభించింది. యిందులో share కలవారు యీ క్రింది విధంగా వున్నారు.

| | | |
|---|---|---|
| 2 | Share holders | 50 |
| 3 | do | 921 |
| 4 | do | 161 |
| 5 to 10 | do | 527 |
| 11 to 20 | do | 73 |
| 21 to 30 | do | 110 |
| 31 to 40 | do | 9 |
| 41 to 50 | do | 3 |
| 51 to 60 | do | 2 |
| 61 to 70 | do | Nil |
| 71 to 80 | do | 7 |
| | Total Shareholders | 1764-1 |

ఈ factory co-operative basis మీద నడుపబడుతున్నది. రమారమి 7 వందల పనివారు రోజు పని చేస్తున్నారు. షుమారు 600 tons చెరుకు ఆడబడుతున్నది. 1955—56 సంవత్సరం నుంచి electricity వచ్చింది. అప్పుడు 70—80 మంది కార్మికులు surpless వచ్చినప్పటికీ, వారిలో ఒక్కరిని కూడా తీసివేయలేదు. 1953వ సంవత్సరంనుంచి వీరికి Scales యిచ్చి increment యిచ్చారు. తక్కువ జీతం వానికి రూ. 63—8—0 లు ముట్టుతున్నది. 1954 వ సంవత్సరం అక్టోబర్‌లో చేసిన సమ్మె సందర్భంలో Labour Tribunal 8 మంది కార్మికులకే తీర్పు యిచ్చింది. 1955—56 సంవత్సరంలో నవరణనోటీసు లేకుండా season లో ఎక్కడి పనివారక్కడ పని వదలేసి సమ్మెచేసినప్పుడుకూడ ప్రభుత్వోద్యోగులు కలుగచేసుకొని Management ను క్షమించమనికోరగా క్షమించారు. ఈ రోజున సమ్మెచేస్తున్నవారు 450 మంది అని పేపర్లలో పడింది. కానీ యిప్పుడుమాట్లాడినసభ్యుడు ఈ అంకెను అతిశయోక్తిగా చూపిస్తున్నాడు. 1955—56వ సంవత్సరం తాలూకు Audit certificate పంపలేదనే ఆరోపణలు చేస్తున్నారు. ప్రభుత్వానికెదో అన్యాయం చేశారని చెప్పిన సంగతేమిటంటే — Bylaws లోని 49వ క్లైలా ప్రకారం Registrar గారి Audit certificate రానిదే దానిని announce చేయకూడదని Government order వుంది. ఆ విషయం విమర్శ చేసేవారికి తెలియదు. కార్మికుల dismis విషయమై చాలా మనవి చేస్తున్నారు. తప్పు చేసిన వారిని శిక్షించకపోతే, dismiss చేయకపోతే ఈ factories ఎట్లా నడుస్తాయి ? ఇన్ని వేల కుటుంబాలకు నలుగురను dismiss చేస్తే, ప్రభుత్వం Management మీద నిందారోపణలు చేయడం వారికి పరిపాటయింది. ఈ

సమ్మె మూలంగా రోజుకు ప్రభుత్వానికి రూ. 20/— వేలు, రైతులకు రూ 30 వేలు నష్టం వస్తుంది. Share—holders కు Rs 30—/ లక్షలు. వ్యవసాయ కూలీలకు రూ. 15 వేలు నష్టం వస్తుంది ఈ రోజున Management వారు సమర్థతతోను, మంచి వుద్దేశ్యంతోను సక్రమంగా నడిపిస్తున్నారు కనుకే యింతవరకు ప్రభుత్వానికీ, ప్రజలకునష్టంలేకుండా జరుగుతోంది. Management కు సామర్థ్యం లేకపోతే, అది రైతుల క్షేమాన్ని కాంక్షించనిదైతే, ఈ రోజున ఈ factory యింత అభివృద్ధిలోనికి ఎల్లా వచ్చిందని అడుగుతున్నాను. 1934వ సంవత్సరంలో మన ఆంధ్రలో మూడు factories ప్రత్యేకంగా ప్రారంభించబడ్డాయి. అందులో రెండు factories, Management లోపాల వల్ల నష్టపడి, యితర్లకు అమ్మబడ్డాయి. ఇంతవరకు భారత దేశం మొత్తం మీద సహకార పద్ధతిలో ఈ factory అభివృద్ధి చెంది మొదటి తరగతికి వచ్చిందని మనవి చేస్తున్నాను. ఎవరినో నలుగురు లేబర్ నాయకులను అన్యాయంగా dismiss చేశారని చెప్పడం చాలా అధర్మమని చెబుతున్నాను. Labour officers విచారణ చేసి adjudication కు పంపించక పోతే ప్రభుత్వానిదాలోపం ? అయితే ప్రభుత్వానికి ఏమీకూడా హక్కు వుండక్కర లేదా ? Managementకు తప్పులున్న వారికి శిక్షించడానికి కాని, dismiss చేయడానికి కాని హక్కులు లేక పోతే ఈ factories ఏమైనా, ఎప్పుడైనా, ఎవరైనా నడిపించగలరా? అని నేను మనవి చేస్తున్నాను. పాముకిపాలు పోసి పెంచితే ఏ విధంగా ఆ మనిషికి అపకారం జరుగుతుందో, అదే విధంగా ఈ illegal strikes కు ప్రోత్సాహం ఇచ్చినట్లయితే, దేశానికి అరిష్టం వస్తుందని మనవి చేస్తున్నాను. స్వపక్ష, పరపక్ష, నిర్దామ ధాములు, అందరిలో, అన్ని చోట్ల, ఉంటారు. వారికి ఎటువంటి ప్రోత్సాహం ఇవ్వకూడదని మనవి చేస్తున్నాను.

రైతులు , గ్రామాలలోని వ్యవసాయ కూలీలు, Agency లలో చెరుకు కూలీల దగ్గరనుంచి కూడ ఈ illegal strikes లేవదీస్తున్నారు.

ఆఖరికి ఇంత అభివృద్ధిచెందినటువంటిది, Co-operative Basis మీద జరుగుతున్న factory లోనా ! ఈ Labour strikes ? ఇప్పుడు ఉన్నటువంటి నాయకులలో కార్మికులకు సహాయం చేసిన వారెవరైనా ఉన్నారా ? అమాయికులు అయిన కూలీలచేత ఈలాంటి illegal strikes చేయిస్తున్న నాయకులను ఏ విధంగా శిక్షిస్తారని, అడుగుతున్నాను. ఈలాంటి illegal strikes కు ఆధారం అయినటువంటి నాయకులను తప్పకుండా "నేను శిక్షిస్తానని సెలవిచ్చారు. ఇప్పుడు అక్కడ 21 రోజులనుండి, మహా ఘోరంగా, అద్భుతమైన సామర్థ్యంతో sirike నడిపిస్తూ ఉన్నారు. వారు గవర్నమెంటుకుగాని, ప్రజలకుగాని, share-holders కు గాని, నష్టం రాని పద్ధతులలో నడుస్తున్నది. ఆ Factory. అలాంటిచోట, అమాయక కూలీలను రెచ్చగొట్టి strike చేయిస్తున్నారు. అక్కడ Poliec వారుకూడ ప్రోత్సాహం చెయ్యడం వల్ల ఈ strike మరికొంత ఉద్రిక్త పొందడానికి కారణమని మనవి చేస్తున్నాను. ఇప్పుడు అసెంబ్లీలో స్పీకర్‌గారు మాట్లాడడానికి, time ఇవ్వడంతోటే మాకు ఏదో అవకాశం కలిగిందని, అక్కడకు wire లు ఇచ్చి "strike" మాత్రం మానవద్దు" అని, పెళ్లాలను , పిల్లలనూ, అందరినీ కూడ strikeలో పోగుచేస్తూ ఉన్నారు.

శ్రీ బి. శ్రీరామమూర్తి:—అధ్యక్షా, Point of order మా మీద allegation చేశారు. ఆ allegation లో , ఇక్కడనుంచి మేము Telegrame ఇచ్చి అక్కడి వారిని, strike చెయ్యమని అంటున్నాము అని చెప్పారు .

(2)

*Disscussion on arrest of the Employees of the Etikoppaka Sugar Mills*

మిస్టర్ స్పీకర్ :— It is not a point of Order. అది wrongకావచ్చు, లేక Right కావచ్చు I have nothing to do. ఒకవేళ తప్పు allegation అయితే కాదని, చెప్పవలసిందే తప్పు, దానిలో Point లేదు, order లేదు Point of order లేవదీస్తే నేను ఎలాగా మాట్లాడ మంటాను కదానని, Point of order అంటారు. అలాగ చేసినట్లయితే నేను warning ఇస్తున్నాను. ఇటువంటిది ఎవరైనా చేసినట్లయితే, ఆ Member ను రెండు , మూడు రోజులవరకూ, మాట్లాడనివ్వను.

శ్రీ బి. శ్రీరామమూర్తి :—అధ్యక్షా, పోనీ తప్పు అని చెప్పనియ్యండి.

*Mr. Speaker :* All right.

శ్రీ రాజాసాగి సూర్యనారాయణ రాజు :—అధ్యక్షా, ఇంకో చిన్న విషయం మనవిచెయ్యదలచు కొన్నాను పోనీ Management తప్పు చేస్తున్నారని, Factory సరిగ్గా నడవడం లేదని, అన్యాయంగా కూలీల తాలూకు సొమ్ము దోచుకొని, ఈ Managementను ధ్వంసం చేస్తున్నారని, తమకు తోచి నట్లైతే ఆ Management ను Abolish చేసి, ఈ నాయకులకు ఆ Management ఇప్పించాలని, ప్రభుత్వాన్ని కోరుతూ సెలవు తీసుకొంటున్నాను.

శ్రీ బి. జి. ఎమ్. నరసింగరావు (కణితి):—అధ్యక్షా, ఈ విషయంలో నేను మనవి చేసేవి చాల ఉన్నాయి.

ఈ Etikoppaka కార్మికులు చేసింది, న్యాయమా? వారు చేస్తున్నసమ్మె మంచిదా? కాదా? అన్న విషయాలే కాకుండా, ఒక Technical Point మీద మాట్లాడ దలచుకున్నాను. వారు Section 22 క్రింద సమ్మె Notice ఇచ్చారు ఇది Public utility concern క్రింద declare కాబడింది. మామూలుగా Public utility concern కాకపోయినట్లయితే ఏ పరిశ్రమను అయినా "Government May refer the matter of adjudication". అనే నిబంధన ఉన్నది.

కాబట్టి గవర్నమెంటు చెయ్యవచ్చు, చెయ్యక పోవచ్చు. కాని అదే Section (22) క్రింద, Public utility concern లో ఉన్న union Notice ఇచినట్లయితే, "Government Shall refer the matter" అని స్పష్టంగా కనబడుతుంది. sec (10) లో Provided that where the dispute relates of public utility service, a notice under section 22has been given, the appropriate Government shall unless it considers అనే ఉంది. దీనిలో "shall" అనే పదం వాడారు.

మిస్టర్ స్పీకర్ :—unless అని చదవమంటున్నారు.

శ్రీ బి జి. ఎమ్. ఎ. నర సింగరావు :—నేను emphasis చెయ్యదగింది "shall" అని, రెండవ దానిలో "May" అని, ఈ "May కి shall" కి తేడా చూపిద్దామని నా ఉద్దేశ్యం.

కార్మిక శాఖ మంత్రి (శ్రీ డి. సంజీవయ్య) —ఒక్కొక్క సారి , "shall" అంటే 'may' అని అర్థం లవుతుంది.

శ్రీ కె. ఎల్. నరసింహారావు (ఎల్లందు—జనరల్) —అధ్యక్షా, "may" అంటే "shall" అవుతుందిగాని, "shall" అంటే "may" ఏ పరిస్థితులలోనుకూడ కాదు.

శ్రీ డి. సంజీవయ్య —అంటే చట్టాలు సరిగా చదవలేదని అర్థం అవుతున్నది

*Mr. Speaker :* I don't agree with Hon'ble Minister.

శ్రీ బి జి.ఎమ్ ఎ నరసింగరావు-ఇక్కడ నాలుగు issues ను పెట్టారు. ప్రభుత్వం దానిలో ఒక item ను Adjudicationకు refer చేస్తూ, మిగతా item లనుచేయలేదు. ఆ మిగతా itemలను కూడ Refer చేసి ఉంటే బాగుంటుందని నానమ్మకం. ఈ పారిశ్రామిక వివాద చట్టం, పరిశ్రమలలో శాంతిని నెలకొల్ప డానికి, ఉద్దేశించబడింది. అంతే కాకుండా, తగాదాలు వస్తాయని ప్రభుత్వం ఊహించినప్పుడు కూడ, అటువంటి తగాదాలను న్యాయ స్థానానికి, పంపించడానికి ప్రభుత్వానికి అధికారం ఉన్నది. కాబట్టి తగాదాలు వస్తాయని, చర్య తీసుకోవడానికి, ప్రభుత్వానికి అధికారం ఉన్నప్పుడు, తగాదా వచ్చినప్పుడు వాటిని , న్యాయ స్థానానికి పంపించి, పరిశ్రమలో శాంతిని నెలకొల్పవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉన్నది ఆ విషయాన్ని ప్రభుత్వ దృష్టికి తీసుకువస్తున్నాను.

ఈ యుగం అంతా Industrial Revolution లో మునిగి ఉందని చెబుతున్నాను. ఆ Factory లో పనిచేసిన కార్మికులకు అక్కడ భాగస్వామ్యము లేదు. భాగస్వాములు ఎవరంటే చెరుకు ఉత్పత్తి చేసిన వాళ్లేనని చెప్పక తప్పదు. పని చేసిన కార్మికులకు ఏమీలేదు. కాని కార్మికుల దృష్టిలో మట్టుకు వారు ఈ Factory యజమానుల క్రిందనే ఉందని అనుకుంటున్నాను. యజమానులు ఇది Capitalist సంస్థ కాదుఅని , Co-operative సంస్థ అని, చెబుతున్నారు. ఈ Co-operative సంస్థ అన్యాయం చేయదని చెప్పడంలేదు. అన్యాయం చేశారనికూడ ఆరోపించడం లేదు మొత్తం మీద యజమాని చేసే ప్రవర్తనే ఈ సంస్థ కూడ చేస్తున్నట్లు కనబడుతున్నది.ఈ చట్టం ప్రకారం ఎప్పుడైతే రక్షణ ఇస్తున్నామో, తగాదా వస్తే ఏ విధంగా Adjudication కు refer చెయ్యడం జరుగుతుందో, ఆలాగే మిగిలిన విషయాలుకూడ refer చేస్తే బాగుంటుందేమోనని నా ఊహ.

ఏ కారణంచేత ఇలాగ చెయ్యలేక పోయిందో నాకు తెలియడం లేదు. ఇప్పటికైనా మించింది ఏమీ లేదు. ప్రతిష్ఠ మీద ఉండకుండా, కార్మికులకు న్యాయం కల్గించేటట్లు, చెయ్యాలి. వారు indesciplined గా ఉన్నట్లయితే Industrial Tribunal వారిని శిక్షిస్తుంది. కార్మికుడు నిర్దోషి అయినప్పుడు వాడికి పూర్తి రక్షణ ఇస్తుంది ఏదైతేనేమి, Judicial determination కు, వదలి పెట్టడం సర్వే సర్వత్రా మంచిది. ఆలా చేసినట్లయితే ప్రభుత్వం చేసిన చట్టాలను ఆమోదించి అమలు జరపడానికి , సర్వే సర్వత్రా కార్మికునికి నమ్మకం కలుగుతుంది

కావున అన్ని Points ను కూడ Industrial Tribunal కు refer చేస్తే బాగుంటుందని, చిన్న సలహా ఇస్తున్నాను.

*Discussion on arrest of the Employees of the Etikoppaka Sugar Mills*

మిస్టర్ స్పీకర్:—ఇప్పుడు ఇంకా ఇద్దరు మాత్రం మాట్లాడ వచ్చును. శ్రీ గోపాలకృష్ణయ్య గారు, శ్రీ కృష్ణంరాజాబహదూరుగారు మాట్లాడుతారు. తరువాత మంత్రిగారిని పిలుస్తాను.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య:—అధ్యక్షా, ఇప్పుడు మనము సోషలిజమును కోరుచున్నాము. సోషలిస్టు కోపరేటివ్ కామన్‌వెల్త్ కావలెనని కోరుచున్నాము గాని ఈనాడు ఏటికొప్పాకలో కో-ఆపరేటివ్ సంస్థగా మిగిలినది ఇది ఒక్కటే అని చెప్పుతున్నాను. అక్కడి పరిస్థితి చూస్తే మనకు కో-ఆపరేటివ్ సంస్థలు పనికి రావు అని అనడము అగుచున్నది. ఇదిఒక విషాద ఘట్టముగా ఏర్పడినది కాబట్టి ప్రభుత్వం ఆలోచించి కోఆపరేటివ్ సంస్థలను బాగా నడిపించవలెనని కోరుచున్నాను. ఈ కో-ఆపరేటివ్ సంస్థలో నామినేటెడ్ సభ్యులు తప్ప ఎన్నుకొన్నవారు లేరు. బోర్డు ఆఫ్ డైరెక్టర్సు ఇంత వరకు సమావేశాలు అయినట్లు లేదు. డిప్యూటీ రిజిస్ట్రారు కూడా దానిలో ఉన్నాడు. ఆయన ఏమి రిపోర్టు పంపినారో తెలియదు. దానిమీద పెత్తనం చేసేవారు. నిరంకుశ విధానముఅమలుజరుపుచున్నారు. మేనేజిమెంటు ఎవరి చేతులలో ఉన్నదో వారే నడుపుచున్నారు. అందుచేత కార్మిక శక్తులను రెచ్చ గొట్టడం జరుగుచున్నది. తమ రాజకీయాలకు ఈ కార్మికులను ఉపయోగించుకోవడానికి సహకార సంస్థలను వినియోగించుకొంటున్నారు. ఎవరూ కూడా కార్మికుల గురించి ఆలోచించడములేదు.

శ్రీ రాజా సాగి సూర్యనారాయణ రాజు:—అధ్యక్షా, on a Point of order Sir, ఇప్పుడు కోఆపరేటివ్ సంస్థలను యజమానులు స్వాధీనంలోనికి తీసుకొంటున్నారని శలవిస్తున్నారు అయితే బైలాస్ ఉన్నవని వారికి తెలియదు కాబోలు. బైలాస్‌ను మించి ఏమైనాచెయ్యడానికి వీలు ఉంటుందా అని మనవి చేస్తున్నాను.

శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్య:—బైలాస్ ఉన్నవన్నది నాకు, తెలిసిన విషయమే. అయితే అవి అమలు జరుగలేదు, మీటింగు జరపాలని ఉన్నది. అది జరగ లేదని నేను చెబుతున్నాను. డైరెక్టర్సు బోర్డుకు ఎన్నికలు ఎందుకు జరుప లేదు. వుయ్యూరు ఫ్యాక్టరీలో స్ట్రైయికు నోటీసుఇస్తే ఆలోచిస్తాము అని అంటున్నారు. నోటీసు ఇస్తే ప్రభుత్వం వారు తరువాత చూస్తాము, ఇప్పుడు స్ట్రైయికు మానుకొండి అంటున్నారు. ఇది ప్రభుత్వ విధానమా ? కాదు సహకార విధానము ద్వారా సంక్షేమ రాజ్యం సోషలిజానికి పురోగమిస్తూ ఉండాలి. శాంతియుతముగా స్ట్రైయికు 21రోజులుగా జరుగుచున్నది. ఈ విధానము నష్టదాయకము గనుక, వారు చెప్పిన విషయాలను అన్నింటిని రిఫరెన్సుకు పంపించండి.అప్పుడు వార్సు స్ట్రైయికు విత్‌డ్రా చెయ్యకపోతే మేము వారి వద్దకు వెళ్లి న్యాయము కాదు, మానుకొనమని చెపుతాము. ప్రభుత్వం రిఫరెన్సుకు పంపాలని కోరుచు విరమించుచున్నాను.

శ్రీ రాజా వి. వి. కృష్ణంరాజబహదూర్ (తుని)·—అధ్యక్షా, ప్రస్తుతము తమముందుజరుగుచున్నట్లు ఏటికొప్పాక ఫ్యాక్టరీ కార్మికుల సమ్మె చర్చ సందర్భంలో నేనుమనవిచేయునది ఏమిటంటే నేను కూడా ఆఫ్యాక్టరీషేరుహోల్డర్సులో ఒకడను. నేనుసభవారికికొన్ని విషయాలు చెప్పదలచుకొన్నాను. మిత్రులు సూర్యనారాయణరాజుగారు చెప్పివున్నారు ఫ్యాక్టరీస్థాపించినది 1932 లో. తదుపరినేటికి 18 వందలమంది షేరుహోల్డర్సుతో సక్రమపంథాలో కోఆపరేటివు పద్ధతిమీాద నడుస్తున్నఫ్యాక్టరీలలో భారత దేశంలో ఇది అగ్రస్థానంవహించుచున్నది. దానినిగురించి పెద్దలుఅంతా చెప్పకుంటున్నవిషయము అంద

రుకుతెలిసినదే. ఈరోజుసరికి కార్మికులు 21 రోజులనుంచి సమ్మెచేస్తున్నారంటే ఆశ్చర్యముగావుంది. మేము కూడా విచారిస్తున్నాము. ఎందుచేతనంటే ఈ 18 వందలమంది షేరుహోల్డర్లు ఆ ప్రాంతము రైతులే. వాటాదార్లుగావుండి సహకారపద్ధతిమీద నడిపిస్తున్న సమయములో ఈ సమ్మెవచ్చింది. ఈరోజున అక్కడకూలీలు, రైతులు చుట్టరికములతోసంబంధములు కలిగినవారు అయివున్నారు. చదువు లేనివారుకావడంమూలముగా కొంతమంది వ్యక్తులు విజయనగరం, శ్రీకాకుళం నుండివచ్చి ఏమేమో, చెబితే లాభం వస్తుందని అనుకుంటున్నారు.అందుకేఈసమ్మెచేస్తున్నారు ఇప్పుడీఫ్యాక్టరీలో పని ప్రారంభము అయి 5 సంవత్సరములు అయినది. లాభంవస్తున్నసమయములో పనిలేని నాయకులు పెట్టినమిత్రద్రోహుల వల్లను సమ్మెజరుగుతూవుంది దీనివల్లచాలా నష్టంవస్తుంది. ఇందుకుఫ్యాక్టరీవారేకాకుండా వాటాదార్లు కూడా విచారిస్తున్నారు. గానియిప్పుడు 1953-1954, 1954-55 సంవత్సరములుబోనస్సు విషయము మాత్రము ట్రిభ్యునలుకు ప్రభుత్వంవారు పంపించారు. 1955-56 కు ఆడిటు రిపోర్టు వచ్చినతరువాత ట్రిబ్యునలుకు పంపడం జరుగుతుంది, అక్కడ యూనియను సెక్రటరీ బీసెట్టి క్రిష్ణమూర్తిగారు వున్నారు ఆయనవెనుక M L. A.గా పోటీచెయ్యడానికి మేనేజింగు వారిఅనుమతి పొందని కారణంగానిరాకరించబడింది. 1953లో తుని పంచాయతీబోర్డుకుమెంబరుగాఎన్నికయినారు. 1956లోతిరిగి పోటీచేసి ఒడిపోయి తిరిగి 1958 జాన్యువరిలో పోటీచేసి తిరిగి ఒడిపోయినారు తునిపంచాయతీలో స్వీపర్ల సంఘం తయారుచేసి దానికి సెక్రటరీగా ఉంటూవున్నారు. ఇప్పుడువారు అదేపనిగా పెట్టుకుని కార్యకలాపాలను నడిపిస్తున్నారు. మేముకూడాకార్మికుల నష్టాలు, కష్టాలు యోచిస్తున్నాము. ప్రభుత్వంవారు ఈవిషయాన్ని industrial disputis Act ప్రకారం ట్రిబ్యునలుకు పంపేరు. అలాంటప్పుడు sec.(10)క్రిందసమ్మె once for all illegalగాను,చట్టవిరుద్ధము అయినదిగానుపరిగణించబడినది. కాబట్టి sec(26) ప్రకారం కార్మికులు, sec(27) ప్రకారం దానిని ప్రోత్సహించినవారిని అమలుజారీ చేసినట్లైతే ఈ 21 రోజులు సమ్మెజరిగేదికాదు. ఫ్యాక్టరీ సక్రమముగా నడిచేది. కాబట్టి illegal strike ప్రభుత్వమువారు ఈసెక్షన్లను అమలుచెయ్యాలని కోరుతూ నేను విరమించుచున్నాను

శ్రీ సి. వి. సూర్యనారాయణరాజు(ఎలమంచిలి)— అధ్యక్షా, నేను ఏటికొప్పాక ఫ్యాక్టరీ మేనేజిమెంటులో ఒకమెంబరును. అంతేకాదు. పెద్దవాటాదారునికూడాను. చెరకువుత్పత్తిదారుల సంఘ అధ్యక్షులుగా 10 సంవత్సరాలనుంచి ఉంటున్నాను. కాబట్టికొన్ని అంశములను మీకుచెప్పవలసివున్నది. ఇప్పుడు శ్రీరామమూర్తిగారు , సూర్యనారాయణగారు మాట్లాడుతూ తప్పెవరిది? అని ప్రశ్నించారు. నేను అంతవరకు పోవలిసిన అవసరంలేదు. మేనేజిమెంటువారు చెప్పేది ఏమిటంటే—కార్మికశాఖవారు వచ్చిరాజీకి ప్రయత్నముచేసినారు. ఆ పాయింట్లను గవర్నమెంటుకు పంపినారు. వారు ట్రిబ్యునలుకు పంపినది ఒకపాయింటు మాత్రమేకాని అన్నిఅంశముల మీద ట్రిబ్యునలుకు పంపితే అభ్యంతరములేదని మేము అంటున్నాము. ఇప్పుడు కార్మికులు కూడా అట్లాచేస్తే తాము సమ్మె withdraw చేస్తాము అంటున్నారు. 21 రోజుల సమ్మెవల్ల ఎంతనష్టమువస్తుందో ఎవరినైనా పంపి తెలుసుకొనవలెను. ప్రభుత్వవుద్యోగస్తులైనా ఏమ్మెనా రిపోర్టులు పంపినట్లులేదు. 650 టన్నులు ఆడవలసినఫ్యాక్టరీ ఈనాడు 450 టన్నులుమాత్రమే ఆడుచున్నవి.మేనేజిమెంటువారు కొంచెం కొంచెం పని చేస్తున్నందువల్ల రోజుకు 500 టన్నుల వరకు ఆడుచున్నది. 100 టన్నులు తక్కువ ఆడుచున్నందున May 10 కి ఆపవలసిన ఫ్యాక్టరీ June 10 వరకు ఆడవలసివస్తుంది. కొన్నిలక్షలు నష్టంరావచ్చును. కార్మికు

కులకు, మేనేజిమెంటుకు తగవుతేవని శ్రీ రామమూర్తిగారు, బుచ్చిబాబుగారు, చెప్పారు ఈతగవుకార్మికులకు, గవర్నమెంటువారికి ఉన్నట్లు వుంది అన్ని అంశములు రిఫరుచేస్తే మాకు అభ్యంతరము లేదని నేను మంత్రిగారికి మనవిచేసినాను కూడా అట్లుచేసి ఎంతత్వరలో ఈసమ్మె ఆపితే అంతమంచిదని చెపుతున్నాను ఇంతవరకు బోర్డుమీటింగు, ఎక్జిక్యూటివు కమిటీ మీటింగుకారేమ ఏమిచెయ్యడము అని ఆలోచించలేదు. గవర్నమెంటువారు ఏమిచేసినా సిద్ధముగా ఉండాలని మాకు ఉంది

శ్రీ డి. సంజీవయ్య:—ఆ విషయము ప్రభుత్వమువారికి ఎందుకుతెలియచెయ్యలేదు

శ్రీ సి.వి. సూర్యనారాయణరాజు:—గవర్నమెంటువారు దానిమీద చర్య తీసుకొనవచ్చుననే ఉద్దేశములో మేనేజిమెంటువారు ఉన్నారు. వ్రాయడము మంచికాదని మేముఊరుకొన్నాము

లేబరు కమీషనర్ గారు స్ట్రయిక్ ప్రారంభించిన పదిహేదారు దినాలకు టెలిగ్రాము యిచ్చారు, ఎవరిమట్టుకువారుకాని, ఇద్దరుకలసికాని మాకుమళ్ళీ అప్పీలు చేసుకొంటే ఆలోచిస్తామని. మేనేజిమెంటు వాండ్లు మాకుఅవసరములేదన్నారు. ఆ పాయింటు ట్రిబ్యునలులో సెటిలు చేసుకోడానికి అభ్యంతరమేమివున్నది. ? ఇంకొకటి చెబుతున్నాను ఇప్పుడు ఈ హవుస్‌లో వున్న ఏ ముగ్గురు ఎం ఎల్. ఏలనైనా సరే అక్కడకు పంపించి విచారణచేయించి వారుచెప్పిన తీర్పుకు ఒప్పుకుంటామని మనవి చేస్తూ సెలవు తీసుకుంటున్నాను.

శ్రీ డి. సంజీవయ్య:— అధ్యక్షా, జనవరి 29 వతేదీన ఈకార్మికసంఘంవారు స్ట్రయికు నోటీసు యిచ్చారు. తర్వాత ఫిబ్రవరి 8—వతారీఖున స్ట్రయికు ప్రారంభమైంది అంతకుపూర్వమే వారి సమస్యలు కొన్ని ప్రభుత్వము ముందున్న కారణము చేత వాటిని పరిశీలించి ఒక రకంగా పరిష్కారమ్ములు చేయబడినవి. ఈ పరిష్కారం ప్రకారం ట్రిబ్యునల్ ముందుకు ఇష్యూ పంపించినాము. ఆ సమస్య ట్రిబ్యునల్ ముందు వుండగా స్ట్రయిక్ చేయడము జరిగింది ఇది ఇల్లీగల్ అనే విషయం తెలియజేయడమైంది. ఇల్లీగల్ స్ట్రయిక్ అని తెలియజేసిన తర్వాత కూడా వారి విషయాన్ని గురించి ఆలోచించినట్లు కన్పించడము లేదు. ఇక వారి ఇష్యూను గురించి ఆలోచనచేసేటప్పుడు ఏదో పబ్లిక్ యుటిలిటీ సర్వీస్ అని 10—వ సెక్షన్ ప్రకారము ఇండస్ట్రియల్ డిస్ప్యూట్‌లో వున్న ఇష్యూస్ కూడా తప్పకుండ రిఫర్ చేసి వుండవలసినదని కొంతమంది గౌరవసభ్యులు తెలియ పరచారు. శ్రీరామమూర్తిగారు సంపూర్ణముగా చదివారు కాని శ్రీ బి. జి. ఎమ్. ఏ. నరసింగరావుగారు సెక్షన్ చదివినప్పుడు ఆయన సంపూర్ణముగా సబ్‌సెక్షన్ చదువలేదు నేను చదివి వినిపిస్తాను.

"Provided that where the dispute relates to a public utility service and a notice under S. 22 has been given, the appropriate Government shall, unless it considers that the notice has been frivolously or vexatiously given or that it would be inexpedient so to do; make reference under this Sub-Section".

ఇది ఇన్‌ఎక్స్‌పీడియంట్‌గా వున్నందున మేము వీటినన్నిటిని రిఫర్ చేయలేదు దానికి ఒక ఉదాహరణ చెప్తున్నాను. ఇక్కడ ఒక ప్రిసిడెంటుకూడా వున్నది. హైకోర్టు డిసిషన్ కూడా వున్నది. దానిలో ఏమి వుందంటే . . . .

'The proviso to Section 10 (1) of the Act left it entirely to the discretion of the Government whether to refer a dispute to a Tribunal or not. The word 'inexpedient' used in the proviso was very wide and despite the world 'shall' it gives complete discretion to the Government.

అందువల్ల గవర్నమెంటుకు కంప్లీట్ డిస్‌క్రిషన్ వున్నదని నేను చెప్పతున్నాను. కొంత మంది గౌరవ సభ్యులు ఒప్పకుంటున్నారు కాబట్టి మానేజమెంటు, కార్మికులు ఒప్పకొని సమస్యను ప్రభుత్వము ముందుకు తెచ్చినప్పుడు ప్రభుత్వము సంపూర్ణముగా పరిశీలనచేసి అదినిజంగా ట్రిబ్యునల్‌కు పంపించడానికి అర్హనీయంగాను, వాంచనీయంగానువుంటే పంపించాలి కాని వచ్చినవన్నిటినీ మేము పంపుతూవుంటే ఒక ఇండస్ట్రియల్ ట్రిబ్యునగా కాదు ఒక లేబర్ కోర్టుకాదు 10 ఇండస్ట్రియల్ ట్రిబ్యునల్సు, 20 లేబర్ కోర్టులు, ఏర్పాటు చేయవలసివుంటుంది. నిజంగా ఇక్కడ వుండే గౌరవనీయ సభ్యులు ఈ ఇండస్ట్రియల్ డిస్‌ప్యూట్ ఆక్టును అమెండ్ చేసినట్లయితే నాకేమి అభ్యంతరము లేదు అని నేను మనవి చేస్తున్నాను. ఇక ఇల్లీగల్ స్ట్రయిక్ అని చెప్పిన తర్వాత కూడ కంటిన్యూ చేస్తున్నారని మన కృష్ణారావు బహదూర్‌గారు చెప్పారు. 26 వ సెక్షన్ వారికొకసారి చదివి వినిపిస్తే బాగుంటుందని నేను అనుకుంటున్నాను.

"Any workmen who commences, continues or otherwise acts in furtherance of a strike which is illegal under this Act shall be punishable with imprisonment for a term which may extend to one month or with fine which may extend to Rs: 50 or with both."

ఈ విధంగా కటినమైన శిక్షలు వున్నాయి. ఇల్లీగల్ స్ట్రయిక్ అని మేము చెప్పినతర్వాత కూడా ఈ స్ట్రయిక్ కంటిన్యూ చేయడము న్యాయము కాదని నేను అనుకుంటున్నాను. బోనస్ విషయం మాట్లాడుతూ వెంకటేశ్వర్లు గారు చెప్పినారు—మూడు సంవత్సరాలది అడిగితే రెండు సంవత్సరాలది మాత్రమే ట్రిబ్యునల్‌కు రెఫర్ చేసినారని, మూడవ సంవత్సరము గురించి ఆలోచన చేయలేదని. ఆ రెండు సంవత్సరములలో లాభము విశేషంగా రాలేదు. కడపటి సంవత్సరంలో విశేషంగా లాభసంపాదించినారు గనుక ఆ విషయమై ఆలోచన చేయులేదని. రెండు సంవత్సరములలో లాభములేదు. కాబట్టి ట్రిబ్యునల్ యిరదుకు పోతే బోనస్ ఇవ్వడానికి వీలులేదని తీర్పు ఇస్తుంది. అయితే కడపటి సంవత్సరములో లాభము వుంది కనుక ట్రిబ్యునలు ముందు పెట్టితే బోనస్ యివ్వవలసి వస్తుందని ప్రభుత్వం వారు ఈ విధంగా చేసినారని ఒక ఏలిగేషన్ చేసినారు. అది న్యాయమైనది కాదు. మామూలుగా ఏదైనా బోనస్ విషయము రెఫర్ చేయవలసి వచ్చినట్లయితే ఆ సంవత్సరములో ఆదాయమెంత, నష్టమెంత, ఖర్చు ఎంత అని తెలుసుకుని ఎంత మిగులుతుందో ఆ లెక్కలు ప్రభుత్వానికి అందినతర్వాత వారికి పంపిస్తున్నాము. నా దగ్గరకు ఈ కార్మిక నాయకులమని చెప్పకునే పెద్దమనుష్యులు వచ్చినప్పుడు నేను వారితో అయ్యా ! ఆ లెక్కలు తేలిన తర్వాత ఆ సంవత్సరపు విషయం కూడా ట్రిబ్యునల్‌కు పంపడానికి నాకేమి అభ్యంతరము లేదు అని అన్నాను. ఇక మిగిలిన దల్లా నలుగురు కార్మికులను బర్తరఫు చేసినారని వారిని మళ్లీ పనిలో పెట్టాలని అంటున్నారు. ఒకాయన విషయం మాత్రం నిజంగా న్యాయమైనటువంటిదేనని చెప్పి మేనేజిమెంటుకు తెల్పినాము—వారిని మళ్లీ పనిలో పెట్టుకొమ్మని. వారు కనుక

నిరాకరించినట్లయితే తగిన చర్య తీసుకొని ట్రిబ్యునల్ ముందుకు పంపించడానికి నాకేమీ అభ్యంతరము లేదని చెప్పినాను. మిగతా వారి విషయం చూచినట్లయితే కోడ్ ఆఫ్ డిసిప్లిన్ అని ఉన్నది సోషలిస్టు నాయకులు, కాంగ్రెస్ నాయకులు, కమ్యూనిస్టు నాయకులు, కార్మిక నాయకులు అందరుకూడా యీ కోడ్ ఆఫ్ డిసిప్లిన్‌ను అంగీకరించినవారే. అందరూ అంగీకరించిన కోడ్ ఆఫ్ డిసిప్లిన్ వున్నప్పుడు, దానికి వ్యతిరేకంగా ప్రవర్తించినప్పుడు తప్పకుండా చర్య తీసికొనేందుకు మానేజిమెంటుకు హక్కువుంది.

అన్ని పక్షాలకు చెందిన నాయకులంతా ఒక నిర్ణయము చేసిన తర్వాత ఆ నిర్ణయానికి వ్యతిరేకంగా ప్రవర్తించినట్లయితే యజమానులకు వారి పైన చర్య తీసుకొనే హక్కు, అధికారము వుంది. వారు సరియైనటువంటి పద్ధతిని అవలంభించి చర్య తీసుకున్నారా లేదా అనేటటువంటి విషయాన్ని పరిశీలించే హక్కు ఈ కార్మిక శాఖకు ఉన్నది. కార్మిక శాఖ లేబర్ ఆఫీసర్ కాని, కమిషనర్ కాని తీసుకున్న ఆక్షన్ సరియైనదని మాకు తోచినప్పుడు ఆ విషయాన్ని మళ్లీ ట్రిబ్యునలుకు రెఫర్ చేయమంటే వీలు లేదని ఖచ్చితముగా చెప్తున్నాను. ఒక్క విషయము మాత్రము చెప్పి ముగిస్తాను. ఇక్కడ ఉపన్యసించిన పెద్దలు కొందరు, కార్మికుల మీద ఒక విధమైనటువంటి సహన భావము, సహకార భావము, సానుభూతి కలిగి ఉండాలి అన్నారు. కార్మికులమీద ఎల్లప్పుడు అన్ని విషయములలోను, అన్ని సందర్భాలలో కూడా సంపూర్ణమైన సానుభూతి నాకున్నది. కాని కార్మిక నాయకులమని చెప్పుకొని తిరుగుతూ కార్మికుల శ్రేయస్సు కొరకు పని చేస్తున్నామనిచెప్తూ కార్మికులను పెడదారిన పట్టించేటటువంటి వాండ్లను జాగ్రత్తగా పరిశీలించాలనేదే నా మనవి. ఈ విషయాలన్నీ సక్రమంగానే జరుగుతున్నాయని మనవి చేస్తున్నాను.

*Sri Pillalamarri Venkateswarlu:* rose in his seat.

*Mr. Speaker :* Will the Hon. Member sit down ? I do not want anybody to interfere.

It is safe for the Hon. Member not to intervene because nobody would intervene when he speaks. He will have that protection. I therefore request all members not to intervene.

*Sri P. Narsinga Rao* was rose in his seat.

*Mr. Speaker:* I will take action against the Hon. Member.

*Mr Narsing Rao:* Will he resume his seat? I am not going to allow any member to utter a syllable even any more. It is all over.

*Sri B. Sriramamurthy:* We are walking out as a protest against the speech of the Minister.

The Members of the Socialist Group then left the Assembly Chamber.

*Sri Pillalamarri Venkateswarlu:* We also walk out.

The members of the PDF and Communist Block left the Assembly Chamber.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య : మేము కూడా walk out చేస్తున్నాము.

The members belonging to Independent Group left the Assembly Chamber.

**Draft Rules Relating To The Hyderabad and Secunderabad Municipal Corporations Profession Tax**

*The Minister for Local Administration (Sri K Brahmananda Reddy);* I beg to move:

"That the following draft of the rules relating to the Hyderabad and Secunderabad Municipal Corporations Profession Tax proposed to be made by the Governor of Andhra Pradesh in exercise of the powers conferred by sub-section (1) of Section 585 of the Hyderabad Municipal Corporation Act, 1955 (Hyderabad Act I1 of 1956), hereinafter referred to as the said Act, be approved, the same having been previously published as required by sub-section (3) of Section 585 of the said Act".

*Mr. Speaker:* Motion moved, (Pause)

*Mr. Speaker:* The question is:

"That the following draft of the rules relating to the Hyderabad and Secunderabad Municipal Corporations Profession Tax proposed to be made by the Governor of Andhra Pradesh in exercise of the powers conferred by sub-section (1) of section 585 of the Hyderabad Municipal Corporations Act, 1955 (Hyderabad Act II of 1956),hereinafter referred to as the said Act be approved, the same having been previously published as required by sub-section (3) of section 585 of the said Act.

The motion was adopted.

**The Andhra Payment of Salaries and Removal of Disqualifications**

**(Andhra Pradesh Amendment) Bill, 1958.**

*Sri N. Sanjeeva Reddy;* I beg to introduced the Andhra Payment of Salaries and Removal of Disqualifications (Andhra Pradesh Amendment) Bill, 1958, and move that the Bill be taken into consideration at once.

*Mr. Speaker :* Motion moved

శ్రీ యన్. సంజీవరెడ్డి:—మనము క్రొత్తగా కౌన్సిలును ఏర్పాటు చేసుకోబోతున్నాము. కౌన్సిలు సభ్యులకు, కౌన్సిలు చైర్మన్ గారికి, కౌన్సిలు డిప్యూటీ చైర్మన్ గారికి జీత బత్యాలు యిచ్చే విషయంలో చట్టాన్ని సవరించుకోవలసి వస్తున్నది. మంత్రులకు యిచ్చినట్లుగా స్పీకర్ గారికి వైద్య సౌకర్యములు కలుగ చేయవలసిన అవశ్యకత ఉన్నదని మేము గుర్తించాము. ఇంతవరకు అటువంటి

(3)

*The Andhra Payment of Salaries and Removal of Disqualifications (Andhra Pradesh Amendment) Bill, 1958.*

అవకాశము లేదు. స్పీకర్‌గారికి, కౌన్సిలు చైర్మన్‌గారికి వైద్య సౌకర్యములు కల్పించే విషయము, కౌన్సిలు సభ్యులకు అనర్హతలు తొలగించే విషయము తప్ప యీ బిల్లులో ఇతరములు లేవు ఇది చాలా చిన్న బిల్లు కౌన్సిలు కావాలని మనము ఇదివరలో తీర్మానము చేసినాము కాబట్టి దీనిని తొందరగా పాస్ చేయవలె నని సభ్యులను కోరుతున్నాను.

శ్రీ కె. యల్. నరసింహారావు:— ఈ బిల్లును గజిట్‌లో 24వ తారీఖున ప్రచురించారు ఎసెంబ్లీ రూల్సులోని 97 (4) రూలు ననుసరించి యీ బిల్లుకు ఏడు రోజులు నోటీసు ఉండాలి. కాని 7 రోజుల నోటీసు ఇవ్వకుండా దీనిని సభముందుకు తీసుకొని రావడము వల్ల దానిని సమగ్రంగా పరిశీలించ డానికి మాకు అవకాశము కల్పింపబడలేదు. అందువల్ల యీ బిల్లును ఇప్పుడు చర్చించరాదని నేను పాయింటు ఆఫ్ ఆర్డరును రెయిజు చేస్తున్నాను.

శ్రీ యన్. సంజీవరెడ్డి:—ఈ అభ్యంతరము తెలిసిన గౌరవ సభ్యులు యీ బిల్లుకు సవరణల్ని పంపారు. ఈ బిల్లు చాలా చిన్నది. ఐదు నిమిషములలో చదువుకొని అర్థము చేసుకొనవచ్చు.

శ్రీ కె. యల్. నరసింహారావు.—నేను సవరణలు పంపించినంత మాత్రం చేత యీ బిల్లును నేను సమగ్రంగా పరిశీలించుటకు వ్యవధి ఉన్నదని ఎంచరాదు. యీ బిల్లును ఇప్పుడు శాసన సభలో ప్రతి పాదించుటకు గాను మన నిబంధనలలోని 97 (4) రూలులో యిచ్చిన వ్యవధిని wire చేయవలసిన అవసరముంది. అందుకు మినిష్టరుగారు తమను ముందుగా కోరవలసి ఉంది. తమరు దానిని అంగీకరించాలి. కాబట్టి తమరు యీ బిల్లును ఇప్పుడు చర్చించుటకు అవకాశము యీయవద్దని మా హక్కులకు భంగము లేకుండా చూడవలెనని కోరుతున్నాను.

మిస్టర్ స్పీకర్:—ఇది చాలా చిన్న బిల్లు ఇందులో కాంట్రవర్సీ లేదు. అందువల్ల వ్యవధిని wire చేయడానికే నేను తీర్మానించుకున్నాను.

శ్రీ కె. యల్. నరసింహారావు.—ప్రభుత్వము వారు తమను వ్యవధి పరిమితిని చేయవలెనని కోర వలసిఉంది.

శ్రీ యన్. సంజీవరెడ్డి:—ముందుగా వ్రాశాము.

శ్రీ కె. యల్. నరసింహారావు:—ముఖ్యమంత్రిగారు చెప్పినట్లుగా యీ బిల్లులో రెండు ముఖ్య విషయములున్నవి. లెజిస్లేటివ్ కౌన్సిలు ఏర్పడుతున్నది. కాబట్టి కౌన్సిలు సభ్యులకు, అనర్హతలు తొలగించాలి. స్పీకర్‌గారికి, చైర్మన్‌గారికి మినిష్టర్లతో బాటు వైద్య సౌకర్యములు కలుగచేయవలె ననేదిది ఇంకొక విషయము. ఈ బిల్లును సమగ్రంగా పరిశీలించడానికి మాకు తగినంత అవకాశమ్ము ఏర్పడలేదు కనుక దీనిపై తప్పని సరిగా మాట్లాడవలసిన అవసరము ఏర్పడినది. ఇది ముఖ్యమైన విషయము . ఇటువంటి బిల్లులు వచ్చినప్పుడు తెలంగాణా రీజినలు కౌన్సిలుకు పంపవలసిన అవసరమున్నది. కౌన్సిలు ఇంకా ఏర్పడలేదు. ఐనప్పటికీ ఇంత తొందరగా దీనిని తీసుకుని వస్తున్నారు ఎప్పుడో జూన్‌లో ఏర్పడబోయే కౌన్సిలు నిమిత్తము ఇప్పుడే యీ బిల్లు పాస్ చేయవలసి వచ్చినంత తొందరలేదు. కాబట్టి దీనిని రీజినలు కౌన్సిలుకు పంపించమని కోరుతున్నాను.

*The Andhra Payment of Salaries and Removal of Disqualifications (Andhra Pradesh Amendment) Bill, 1958*

శ్రీ బి శంకరయ్య (బుచ్చిరెడ్డిపాలెం—జనరలు) :— లెజిస్లేటివ్ కౌన్సిలును ఏర్పాటు చేసే విషయము గురించి ఇదివరలోనే మనము చర్చించాము. దానిని ఏర్పరచడానికి ఇంకా కొంత వ్యవధి ఉన్నది. కాబట్టి ఇప్పుడే ఇంత తొందరగా యీ బిల్లును తీసుకొని రానక్కరలేదు. మన దేశములోని కొన్ని రాష్ట్రములలో ఇప్పుడు కౌన్సిల్సులేవు. మన రాష్ట్రములో ఏర్పడబోయే కౌన్సిల్లో నామినేటెడ్ సభ్యుల సంఖ్య ఎక్కువ చేయడము జరిగింది. కాబట్టి దానిని గురించి మనము ఇప్పుడు చర్చచేయాలి మనఆర్థిక పరిస్థితిని చూచినప్పటికి ఇప్పుడు యీ కౌన్సిలు మనకు అనవసరమని చాలా మంది చెబుతున్నారు ఇదివరలో భాషా ప్రయుక్త రాష్ట్రాలు లేనప్పుడు అల్ప సంఖ్యాక వర్గముల రక్షణ నిమిత్తము లెజిస్లేటీవ్ కౌన్సిల్సు ఉండుట లవసరమైనప్పటికీ యీ నాడు అట్టి అవసరములేదు. కాబట్టి లెజిస్లేటివ్ కౌన్సిల్సు ఉండ నక్కర్లేదు.

మిస్టర్ స్పీకర్·—కౌన్సిలు అవసరమా లేదా అన్నది ఎన్నడో తేలిపోయింది. దానిని·గురించి ఇప్పుడు చర్చించడము న్యాయము కాదు. కౌన్సిలు కావలెనని ఒక తీర్మానం మొట్టమొదట పెట్టారు. ఆ తీర్మానమునకు వ్యతిరేకులు అనుకూలురు మాట్లాడారు. రాజ్యాంగ చట్టములోని ఆర్టికలు ప్రకారము కౌన్సిలు నిర్మాణాన్ని కోరేవారికి కావలసినంత మెజారిటీ వచ్చింది. తరువాత యీ విషయము పార్లమెంటులో బిల్లు రూపంలో ఆమోదింపబడి యాక్టు పాస్ అయింది. కాబట్టి కౌన్సిలు అక్కర లేదని ఇప్పుడు చెప్పడం సబబు కాదు. ఇప్పుడు కౌన్సిలు చైర్మన్ అయినంత మాత్రంచేత డెప్యూటీ చైర్మన్ అయినంత మాత్రంచేత డిస్ క్వాలిఫికేషన్ ఏర్పడకుండా స్పీకర్ వలెనే డెప్యూటీ స్పీకర్‌వలెనే, ఉండాలనేదే ముఖ్యమైన సవరణ. రెండవది వైద్య సౌకర్యముల గురించి అవి అక్కర్లేదంటే తీసివేసుకోవచ్చు. ఇతర విషయముల గురించి మాట్లాడడము న్యాయం కాదు యీ బిల్లును రీజినలు కౌన్సిలుకు పంపవలసిన అవసరముకూడా లేదు.

శ్రీ బి. శంకరయ్య —నామినేటెడ్ సభ్యుల సంఖ్యను తగ్గించేదానికొరకు ఆలోచించాలి. కౌన్సిలుకు ఇన్‌డైరెక్టు ఎలెక్షన్సు ఏర్పాటు జేస్తున్నారు. అందులోకూడా నామినేషన్స్ ఉండవలసిన అవసరములేదు.

శ్రీ యన్. సంజీవరెడ్డి:—ఇదివరలో కౌన్సిలు కావలెనని $\frac{2}{3}$ మెజారిటీతో తీర్మానము పాస్ చేశాము. అప్పుడు యీ సభ్యులందరూ చర్చలో పాల్గొన్నారు. ఆ తీర్మానాన్ని ఇప్పుడు ప్రశ్న వేయడము మంచిది కాదు . పార్లమెంటులో బిల్లు పాసయి శాసనం వచ్చింది. రాబోయే సభ్యులకు చైర్మన్‌కు డెప్యూటీ చైర్మన్‌కు జీతాలు ఇవ్వాలి. అంతకన్న యిందులో కొత్త విషయాలు లేవు. ప్రతిపక్ష సభ్యుల, సిద్ధాంతరీత్యా కౌన్సిలుకు వ్యతిరేకులు. అందుకు ఆక్షేపణలేదు. వారి వ్యతిరేకతను గమనించిన తరువాతనే యీ సభ తీర్మానము పాస్ చేసింది. పార్లమెంట్‌కూడా శాసనము చేసిన తర్వాత అనవసరముగా కాలయాపన చేయకుండా అందరం దీనిని ఆమోదిస్తే ఇంకొక కార్యక్రమానికి పోవడానికి వీలవుతుందని నేను అప్పీలు చేస్తున్నాను.

మిస్టర్ స్పీకర్:—రీజినలు కమిటీకి పంపవలసిన అవసరం లేదని. rule out చేస్తున్నాను. దాని విషయం మాట్లాడ నవసరం లేదు. తరువాత కౌన్సిలు —కావలెనా, లేదా అనేది పాయింట్ ఆఫ్

ఆర్డర్‌ను rule out చేస్తున్నాను. దానికి పార్లమెంటులో బిల్లుకూడా పాస్ అయినది అందుకు వ్యతిరేకంగా మాట్లాడటానికి హక్కు లేదు పోతే, స్పీకరుకు వైద్య సౌకర్యముల గురించి, కౌన్సిలు చైర్మన్ డిప్యూటీ చైర్మన్, సభ్యుల జీతముల గురించి యీ బిల్లు ఉన్నది

*Mr. Speaker:* The question is·

'That the Andhra payment of Salaries and Removal of Disqualifications (Andhra Pradesh Amendment) Bill, 1958 be taken into consideration at once.'

The motion was adopted.

### Clauses 2 to 8

*Mr. Speaker* The question is

'Clauses 2 to 8 stand part of the Bill.

The motion was adopted.

Clauses 2 to 8 were added to the Bill.

### Clause 9

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు —అధ్యక్షా, వైద్య సౌకర్యము గురించి అమెండ్‌మెంట్ ఉన్నది. మా ఆక్షేపణ ఏమంటే — సాధారణంగా, ప్రజలకంటే ఎక్కువ సౌకర్యాలు—మీరుగాని, మేముగాని, మంత్రులు గాని— అవసరంగా ఎందుకు కోరాలనేది సమస్య డబ్బు లేనివారు ఉచిత వైద్యం కోసం హాస్పిటల్సు పోయినట్లు, ఈ బిల్లులో ఉచితవైద్యాసౌకర్యములు ఎందుకు కల్పించాలనే ఉద్దేశ్యముతో ఉన్నాము· యావత్ ప్రజానీకానికి ఉచిత వైద్యసౌకర్యాలు కలిగించేంతవరకు మనముకూడా కోరకుండా ఉంటే బాగుంటుందని నా అభిప్రాయం ఆ విషయం తప్పితే, యిందులోని మిగతా వాటికి అభ్యంతరంలేదు

మిస్టర్ స్పీకర్:—ఈ సవరణలో అల్లాలేదు "the member of the Legislative Assembly or the Member of the Legislative Council" కూడా చేర్చాలని ఉన్నది.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు.— ఇంకా move చేయలేదు. opposition for opposition sake మేము చెప్పటలేదు మేము తెలిపిన ఆక్షేపణ విషయమై చీఫ్ మినిష్టరుగారు ఏమైనా చెబితే చూస్తాము.

శ్రీ యన్. సంజీవరెడ్డి —ఇదివరకు 'opposition for opposition sake, కాకపోయినా, యిప్పుడు మాత్రం అదేనని లక్ష్యం అవుతున్నది. మంత్రులకు ఉచిత వైద్య సౌకర్యము యివ్వటం తప్పయితే అది వేరే సంగతి. మంత్రులందరకు యిచ్చిన తరువాత స్పీకరుకు, కౌన్సిలు చైర్మన్‌కు యివ్వకుండా ఉండటం మంచిది కాదు, న్యాయం కాదు. నరసింహారావుగారు యిచ్చిన అమెండ్‌మెంట్‌లో శాసన సభ్యులందరినీ యిందులో చేర్చమని కోరారు. అది అంగీకరించుటకు వీలులేదు. మన స్పీకరుగారు వయస్సుకు పెద్దవారైనా, జబ్బు పడకుండా, ఇంగ్లీషు మందులతో ప్రమేయం లేకుండా

మకర ధ్వజము అనే మందు పుచ్చుకొని కాలము గడుపుతున్నారు. మందుల ఖర్చు ఉండదు. దానిని గురించి ఎక్కువ చర్చ చేయుట మంచిది కాదని, ఏకగ్రీవంగా pass చేయాలని కోరుతున్నాను.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య:— మకరధ్వజము అనే మందు గవర్నమెంట్ హాస్పిటలు స్టాకులో చేర్చే ఏర్పాటు చేస్తారా ?

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు:—మంత్రులకు ఉచితవైద్య సౌకర్యము ఉంటే, స్పీకరుకు కూడ ఉండవలసినదే కాని మంత్రులకు కూడ అనవసరమని మా అభిప్రాయం

*Sri K.L. Narsimharao*: I beg to move:

"After the word 'Chairman' insert the words 'the Member of the Legislative Assembly or the Member of the Legislative Council.

*Mr. Speaker:* Motion moved.

శ్రీ కె. యల్. నరసింహారావు:—అధ్యక్షా, మా పార్టీ యొక్క అభిప్రాయాన్ని శ్రీ వెంకటేశ్వర్లుగారు స్పష్టముగా మీ ముందు పెట్టారు. అయినప్పటికీ మంత్రులకు ఉన్నది కాబట్టి స్పీకరుగారికి కూడా ఆ అవకాశం కల్పిస్తే బాగుంటుందని ముఖ్య మంత్రిగారు చెప్పారు. ప్రత్యేకంగా స్పీకరు విషయములో మేము అడ్డుపెట్టదలచుకొనలేదు మేము చెప్పేదేమంటే — మంత్రులు వెయ్యి రూపాయలు—జీతాలు తీసుకొంటున్నారు. ఇంకా ఇతర సౌకర్యాలున్నవి. వైద్య సౌకర్యం ఉచితంగా కావాలంటున్నారు. అవసరమయితే మంచి మంచి డాక్టర్లను పిలిపించుకొని వైద్యము చేయించుకొనే శక్తి కలిగినవారు కాని శాసన సభ్యులకు రూ. 150 లు యిస్తున్నారు. అందువలన శాసన సభ్యులకు కౌన్సిలుసభ్యులకు కూడ ఉచితవైద్య సౌకర్యము కలిగించవలసినదని కోరితే, దానికి మేము సిద్ధంగా లేము అని ముఖ్య మంత్రిగారు అనటం న్యాయంగాలేదు మినిస్టర్లకు, స్పీకరుకు సర్వదా జబ్బుపడే అవకాశం లేనట్లుగానే సభ్యులకు కూడ ఎక్కువగా జబ్బు పడే అలవాటు లేదు ఏదైనా తప్పని సరియయి, హాస్పిటలులో చేరవలసిన పరిస్థితి ఏర్పడితే చేస్తారుగాని, బిల్లులో అవకాశం కల్పించారు కాబట్టి రేపటినుంచి సభ్యులంతా జబ్బులు పడే అలవాటుకు మాత్రం లోనుకారు. అందుకని ముఖ్యమంత్రిగారు దీని విషయంలో తిరిగి ఆలోచిస్తారని, ఈ సవరణను అంగీకరిస్తారని ఆశిస్తున్నాను.

శ్రీ యన్. సంజీవరెడ్డి:—దీనికి ప్రత్యేకంగా సమాధానం చెప్పేదేమీ లేదు. మంత్రులకు, స్పీకరుకు వేతనాలు ఎక్కువ ఎందుకు పెట్టారంటే—వారు యితర వృత్తులు చేయకూడదు. శాసన సభ్యులైతే వారి వ్యాపారం, వ్యవసాయం మొదలయినవి చూచుకొంటూ ఉంటారు. మంత్రులు రోజుకు 24 గంటలు, 365 రోజులు పని చేయాలి. ఈ వైద్య సౌకర్యం యిప్పుడు కొత్తగా కల్పించినది కాదు. ఎన్నో ఏండ్లుగా వస్తున్నది. ఇది స్పీకరు గారికి extend చేస్తున్నామేగాని కొత్తది కాదు. కాబట్టి యిప్పుడు వీటన్నిటిని తిరగతోడి మాట్లాడటం భావ్యం కాదు. ఇందులో స్పీకరుగారిని include చేయటమే కాబట్టి దీనిని ఏకగ్రీవంగా ఆమోదించవలెనని కోరుతున్నాను.

*The Andhra Payme it of Salaries and Removal of Disqualifications (Andhra Pradesh Amendment) Bill, 1958.*

శ్రీ ఇ. చిన్నప్ప (మహబూబ్‌నగర్).—సభ్యులు తమంతటతాము వైద్య సౌకర్యాలు కావాలనటం సమంజసం కాదని భావిస్తున్నాను మంత్రులే సభ్యులను కూడా చేరిస్తే బాగుంటుంది స్పీకరుగారి విషయంలో కూడ చర్చ లేకుండ ఆమోదిస్తే బాగుంటుందని మనవి చేస్తున్నాను.

*Sri K.L. Narasimharao:* I beg leave of the House to withdraw my amendment

The amendment was, by leave of the House, withdrawn.

*Mr. Speaker:* The question is

'Clause 9 stand part of the Bill

The motion was adopted.

Clause 9 was added to the Bill.

**Clause 10**

*Mr. Speaker:* The question is:

"Clause 10 stand part of the Bill.

The motion was adopted.

Clause 10 was added to the Bill.

శ్రీ యస్. వేమయ్య (బుచ్చిరెడ్డి పాలెం-రిజర్వుడు):—అధ్యక్షా, క్లాజు 11 లోని 'సి' గురించి నేను మాట్లాడ దలచుకొన్నాము నామినేషన్ పద్ధతి వలన అన్ని పక్షాలనుండి సరైన కేండిడేట్స్‌ను ఎన్నుకొనే వీలు లేక పోతుంది కాబట్టి, యీ నామినేటెడ్ పద్ధతి తీసివేయాలని మాయొక్క ఉద్దేశాన్ని వ్యక్తం చేస్తున్నాము.

మిస్టర్ స్పీకర్:—నామినేషన్ పనికిరాదని ఇందులో చెప్పటానికి వీలులేదు. నామినేటెడ్ కేండిడేట్స్‌కు కూడా యీ డిస్‌క్వాలిఫికేషన్ వర్తిస్తుందా లేదా అన్నదే యిప్పుడు ఉన్న విషయం. దానిని మీరు వ్యతిరేకిస్తున్నారా ?

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు.—నామినేటెడ్ కేండిడేట్స్ ఉన్న తర్వాత, వారికి డిస్‌క్వాలిఫికేషన్ ఉండాలనే ఉద్దేశం కాదు. నామినేషన్ విధానం మన కాన్‌స్టిట్యూషన్ లోనే ప్రొవైడ్ చేశారు అని అనుకొంటాను. కాబట్టి గవర్నర్ చేత నామినేషన్ చేయించే విషయంలో మన రాష్ట్రంలో ఉండేటటువంటి విద్యావేత్తలను, విజ్ఞానవేత్తలను, శాస్త్ర వేత్తలను, కవులను, పెద్ద పెద్ద ప్రముఖులను అందరిని దృష్టిలో పెట్టుకొని, యీ నామినేషన్స్ జరిగేటట్లు మన ముఖ్య మంత్రిగారు, కేబినెట్ రికమెండ్ చేస్తారని ఆశిస్తున్నాను.

శ్రీ యస్. సంజీవరెడ్డి:—చాలా సంతోషము. వెంకటేశ్వర్లుగారు చెప్పినట్లు తప్పకుండా చేస్తాము. కాని వేమయ్యగారు మాట్లాడుతూ, అన్ని పార్టీలను జ్ఞాపకం పెట్టుకోవాలని చెప్పారు. అన్ని పార్టీలవారు పంచుకోవాలని నేను అనుకోలేదు. వెంకటేశ్వర్లుగారు చెప్పినట్లు, మన రాష్ట్రంలో ఉన్న పెద్దవారిని నామినేట్ చేయటానికి గవర్నర్ తప్పకుండా చర్య తీసుకొంటారు,

*The Andhra Payment of Salaries and Removal of Disqualifications (Andhra Pradesh Amendment) Bill, 1958.*

శ్రీ యస్. వేమయ్య:—అధ్యక్షా, పర్సనలు ఎక్స్‌ప్లనేషన్ సర్, నామినేషన్స్ పార్టీ దృక్పథంతో మాత్రమే చేయకుండా యీ కళల విషయంలో, సంగీతం విషయంలో, ఇంకా ఇతర విధాల గొప్పవారిని మాత్రమే నామినేట్ చేయాలని నా ఉద్దేశంగాని, పార్టీలకు పంచమని నా ఉద్దేశం కాదు.

మిస్టర్ స్పీకర్:—కళలలో, సంగీతంలో, లలిత కళలలో, గొప్పవారైన వారిని నామినేట్ చేయాలని అంటారు. మంచిదే. వారికి ఎటువంటి అభిప్రాయాలు ఉన్నా, వారు ఏ పార్టీవారైనా తప్పలేదు. అటువంటివాటితో సంబంధం లేదు. వారు గొప్పవారైతే, వారిని నామినేట్ చేయటానికి ఆలోచించవచ్చు, అందులో తగాదా ఉండదు.

*Mr. Speaker*: The question is:

'That clause 11 stand part of the Bill.'

The motion was adopted:

Clause 11 was added to the Bill.'

**Clause 12.**

శ్రీ బి. వి. శివయ్య:— క్లాజు 12 విషయంలో ఒక చిన్న విషయాన్ని చీఫ్ మినిస్టర్‌గారి దృష్టికి తేదలచు కొన్నాను.

"in the case of a member of the Andhra Legislative Assembly, within one month from the date on which he makes and subscribes the oath or affirmation referred to in Article 188 of the Constitution"'.

ప్రతి అసెంబ్లీ సభ్యుడు తాను ప్రమాణము చేసిన ఒక నెల రోజులలోపల , తాను తన జీతంలో ఏమైనా తగ్గించుకోవాలంటే ముందుగా ఇంటిమేట్ చేయాలని యీ క్లాజులో 'సి' బిట్‌లో ఉన్నది. ఇప్పుడు యీ బిల్లులో లెజిస్లేటివ్ కౌన్సిలు అన్నమాట తప్పవేరే మార్పులు లేవు. ఈ మధ్య ఆస్టెరిటీ డ్రైవ్ ప్రోగ్రాం సందర్భంలో చాలా మంది శాసన సభ్యులు తమజీతంలో కొంత వాలంటరీగా కట్‌చేసుకొన్నారు. వారు ఒత్ తీసుకొన్న తర్వాత ఒక నెల లోపల కాకుండా 5, 6 నెలలు అయిన తర్వాత కూడ తమ జీతంతో కొంత వాలంటరీగా కట్ చేసుకొన్న సందర్భాలున్నాయి. కాని యాక్టులో ఒక నెల రోజుల లోపల యీ వాలంటరీ కట్స్ చేసుకోవాలని ఉన్నది. ఇప్పుడు యీ యాక్టుకు సమగ్రమైన సవరణ తీసుకు వస్తున్నారు, కాబట్టి యీ సందర్భంలోనే ఎప్పుడైనా సరే, తమ జీతంలో కొంత వాలంటరీగా కట్ చేసుకోవచ్చునని సవరిస్తే బాగుంటుంది, అప్పుడే, ఆ విధంగా ఇది వరకు వాలంటరీగా కట్‌చేసుకొన్నవన్నీ లీగల్లీ రైట్ అని చెప్పటానికి అవకాశం కలుగుతుంది. కాబట్టి అందుకు సవరణ చేస్తే మంచిదని ముఖ్యమంత్రి గారి దృష్టికి తీసుకు వస్తున్నాను.

శ్రీ యన్. సంజీవరెడ్డి:—ఇక్కడి శాసన సభ్యులేకాదు, పార్లమెంటు సభ్యులుకూడ తమ జీతాల్లో కొంత తగ్గించుకొన్నారని, తరువాత వాటిని తిరిగి ఉపసంహరించుకొన్నారని మనం పత్రికలలో చదువుతున్నాము. ఏదో చట్టంలో ఉన్నది అలాగే ఉండనిస్తే మంచిది. ఇంకా ఎవరైనా తమ జీతాల్లో తగ్గించుకోటానికి సిద్ధంగా ఉన్నామని ముందుకు వస్తే , చట్టాన్ని సవరించి అయినా సరే, వారి జీతాల

*The Andhra Payment of Salaries and Removal af Disqualifications (Andhra Pradesh Amendment) Bill, 1958.*

తగ్గదలను అంగీకరించడానికి ప్రభుత్వం సిద్ధంగా ఉన్నది. ఈ బిల్లు కౌన్సిలుకు సంబంధించినది. ఇది సమగ్రమైన అమెండుమెంట్ కాదు కాబట్టి, ఆ విషయాన్ని ఇప్పుడే సవరించవలసిన అవసరం లేదని చెబుతున్నాను.

*Mr. Speaker :* The question is.

"That Clause 12 stand part of the Bill."

The motion was adopted.

Clause 12 was added to the Bill.

**Clause 1,**

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య:—అధ్యక్షా, క్లాజు 1 లో నవంబరు ఒకటి, 1956 అని పెట్టారు. అసలుమొదట ఈయాక్టు 1953లో వచ్చింది. కనుక ఈబిల్లును from the begnning అని అంటే సరిపోతుంది. అసలు తారీఖు లేకపోతే ఇబ్బంది ఏమిటి ? అసలు తారీఖు ఉండవలసిన అవసరం ఏమిటి ? తారీఖు ఉండనక్కర లేదని నేను అనుకొంటున్నాను. ఉండటమే అవసరమైతే ఆంధ్రాస్టేట్ ఏర్పడినప్పటినుండి ఉంచితే అది గౌరవంగా ఉంటుంది.

శ్రీ యన్. సంజీవ రెడ్డి:—అది ఏమీలాభం లేదండి. కొత్తగా, ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడిన తర్వాతనే యీ ఫెసిలిటీస్ ఇవ్వదలచుకున్నాము. పూర్వంనుండి కాకుండా, ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడిన తర్వాతనే అన్న ఉద్దేశంతోనే నవంబరు ఒకటి, 1956 అని ఉంచాము. ఇది చాలును దీనివల్ల మన పర్పస్ సర్వ్ అవుతుంది ఏదో తృప్తికోసం, 1953 అని పెట్టాలి అంతేగాని దానివల్ల లాభం లేదు.

*Mr. Speaker :* The question is.

'That Clause 1 stand part of the Bill.'

The motion was adopted.

Clause 1 was added to the Bill.

**PREAMBLE**

*Mr. Speaker :* The question is.

"That Preamble stand part of the Bill."

The motion was adopted.

Preamble was added to the Bill".

*Sri N. Sanjeeva Reddi:-* I beg to move.

'That the Andhra Payment of Salaries and Removal of Disqualifications (Andhra Pradesh Amendment) Bill, 1958 be passed into law.'

*Mr. Speaker :* Motion moved.

*The Andhra Payment of Salaries and Removal of Disqualifications (Andhra Pradesh Amendment) Bill, 1958.*

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య:—అధ్యక్షా, కౌన్సిలు రాబోతున్న సందర్భంలో నేను కొద్దిగా మాట్లాడదలచుకొన్నాను మనకు కౌన్సిలు ఏర్పడ బోతున్నది ఇప్పుడుదానికి మేము వ్యతిరేకులమని చెప్పటంలో అర్థం లేదు ఎందుకంటే , సంజీవరెడ్డిగారు చెప్పినట్లు ఎవరి అభిప్రాయాలు వాళ్లకు ఉన్నాయి. కౌన్సిలు ఏర్పడవలయుననే బిల్లు పాస్ అయినది. త్వరలోనే కౌన్సిలు ఏర్పడ బోతున్నది. కౌన్సిలుకు సంబంధించిన కాన్‌స్టిట్యుయన్సీస్, ఓటర్సు గురించి మనం ఆలోచించవలసి ఉన్నది. ఉదాహరణకు లోకలు బోర్డ్సు కాన్‌స్టిట్యుయన్సీ ఉన్నది. అందులో పంచాయితీలు రెండు రకాలుగా ఉన్నాయి. 'ఎ' క్లాసు 'బి' క్లాసు అని రెండు రకాలు ఉన్నాయి. చిన్న పంచాయితీలు కాకుండా, నూటికి ఒకటిగా ఉన్నటువంటి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్సును వేసిన పంచాయితీ బోర్డ్సు ప్రసిడెంట్లు మాత్రమే ఓటర్లుగా ఉంటారని తెలుస్తున్నది.

శ్రీ యన్. సంజీవరెడ్డి —మిస్టర్ స్పీకర్ సర్, సభ్యులు కౌన్సిలు అండ్ కాన్‌స్టిట్యుయన్సీస్ గురించి చెప్పటం జరుగుతోంది. వారు చెబుతున్న దానికి, యీబిల్లుకు సంబంధంలేదు.

I do not think it arises here.

*Sri K. Brahamananda Reddy:* It has been settled by law of Parliament. We cannot discuss it here.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య —వారు జీతాలు తీసుకోటానికి వస్తున్నారు కదా ? కొద్ది మంది ఓటర్సుకు బదులు ఎక్కువ మంది ఓటర్సు వచ్చేటట్లు చేస్తే . . . . .

మిస్టర్ స్పీకర్.—ఇక్కడ అదంతా చెప్పినందువల్ల లాభము లేదు. ఆ విషయాలన్నీ పీపుల్సు రిప్రజెంటేషన్ యాక్టులో ఉన్నవి. దాని ప్రకారంగా జరుగుతుంది. కాబట్టి ఆ విషయాలు సభ్యులు ఇప్పుడు చెప్పినందువల్ల లాభము లేదు. It has nothing to do here.

శ్రీ యన్. సంజీవరెడ్డి. — ఆ విషయము Council లో discuss చేయబోతున్నాము. Therefore I do not think it will arise in this Bill.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య :— ఎ బి తరగతులు పంచాయితీ బోర్డు ప్రసిడెంట్లు అందరు కూడ ఓటర్లుగా వచ్చేటట్లు చేయండి అని అంటున్నాను.

మిస్టర్ స్పీకర్ : Represention of the peoples Act ప్రకారము జరుగుతుంది.

శ్రీవావిలాల గోపాలకృష్ణయ్య:— దీనికి సంబంధించినది వేరే relevant విషయమును గుర్తించి మాట్లాడవచ్చుకదా !

మిస్టర్ స్పీకర్.—ఏదైనా ఉంటే మాట్లాడండి.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య:—జీతాల విషయము ముఖ్యమంత్రిగారు చెప్పారు. ఈ జీతాలు statutory గా ఏర్పడ్డవి. అందులో జీతాలు తగ్గించడమనేది ఉంటే, మీకేమి అభ్యంతరము ఉండదు.

మిస్టర్ స్పీకర్ —ఆ విషయము ఇప్పుడు కాదు.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య — Austerity drive లేక Economy drive అని ఉన్నది గనుక మంత్రులు 500 రూపాయలు జీతము తీసుకుంటే మంచిదని చెప్పదలచుకున్నాను.

మిస్టర్ స్పీకర్:—అలాంటిది ఏదైనా ఉంటే, మీరు వారు మాట్లాడుకొని, దానికి తరువాత బిల్లుపై ఒకటి పెట్టుకొండి. ఇంకా ఏమైనా చేసుకొండి అంతేకాని, ఇప్పుడు అది అంతా చెప్పి లాభము లేదు.

*Mr. Speaker :* The question is

"That the Andhra Payment of Salaries and Removal of Disqualifications (Andhra Pradesh Amendment) Bill, 1958 be passed into law.

The motion was adopted.

## The Madras Entertainments Act (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958.

*The Minister for Finance ( Dr. B. Gopalareddi):* Mr. Speaker Sir, I beg to introduce the Madras Entertainments Act (Andhra Pradesh Amendment) Bill, 1958 and move that the Bill be taken into consideration at once.

*Mr. Speaker:* Motion moved:

డాక్టర్ బి. గోపాలరెడ్డి:—ఇప్పుడు యీ బిల్లులో కొత్త విషయము ఏమీ లేదు. చాలాకాలముగా అమలులో ఉన్న విషయమే ఇప్పుడు తీసుకుంటున్నాము. కొత్త విషయము ఈషణ్మాత్రమైన లేదు. ఆంధ్రలో ఇప్పుడు అమలులో ఉన్న Entertainment tax విధింపు ఒక పద్ధతిలో ఉన్నది. దీనికి సంబంధించి హైదరాబాదులో ఏదో ఒక యాక్టు మాత్రము ఉన్నది. కాని అది అమలులో లేదు. Local Boards Act క్రింద Corporation కాని, Municipaleties కాని జిల్లా బోర్డులుకాని, పంచాయితీలు కాని, వారి వారి అధ్వర్యము క్రింద ఉన్న ఏరియాలలో ఈ Entertainment Tax అనేది వారే వసూలు చేసుకుని, తీసుకుంటున్నారు. కాని ఆంధ్రలో ఆ విధముగ కాకుండా ఈ Tax ను ప్రభుత్వమే వసూలుచేసి మునిసిపాలిటీలకు, 80% వరకు ఇస్తున్నారు. ఆంధ్రలో ఈ పద్ధతి ఉన్నప్పుడు, హైదరాబాదులో Local bodies యే ఈ అధికారమువంతా చలాయిస్తున్నారు మొత్తముమీద మనమందరము ఈ రెండుప్రదేశములు integrate కావాలని కోరుతున్నాము గనుక యీ బిల్లు తీసుకుని రావడము జరిగింది. సినిమాలకు పోయే వారందరికి, ఈ integration ద్వారా ఒకే పన్ను విధింపు జరిగితే మంచిదనే ఉద్దేశ్యముతో యీ బిల్లును ప్రవేశ పెట్టుతున్నాను. అయితే తెలంగాణాలో Local Boards, Municipalties చలాయిస్తున్న అధికారమును పోగొట్టుకుంటారేమో నన్న అనుమానము వుండవచ్చు. వారికి 1957

మార్చి ఆఖరు వరకు అయిన ఖర్చులు పోను ఎంత వసూలు అయిందో, ఆ మొత్తము అంతా కూడ వారికే యివ్వడానికి ఒక హామీ ఉన్నది. లేక పోతే 80% గాని, లేక 1957లో వచ్చిన మొత్తముగాని, ఏది ఎక్కువ గా ఉంటే అది యివ్వటానికి ప్రభుత్వము ఒప్పకుని యున్నున్నది. తక్కువ యేమి యివ్వడము లేదు. 1957వ సంవత్సరములో వచ్చిందో, లేకపోతే ఈ కొత్త చట్టము ప్రకారము 80 పరసెంటో ఈ రెంటిలో ఏది ఎక్కువ అయితే అది వారికి compensate చెయటానికి ప్రభుత్వం అంగీకరించింది. అందువల్ల ఆంధ్రలో ఉన్న యాక్టును ఇక్కడ తెలంగాణాకు అన్వయింప జేయాలని ప్రభుత్వము యొక్క ఆలోచన.

ఇది గాక Show Tax అని వేరే ఒకటి ఉన్నది. ఈ Tax రెండు ప్రదేశములలోను ఉంటున్నది. దీనికి Entertainment tax కు సంబంధము లేదు. Entertainment tax టెక్కెట్ల మీద వసూలు అయిన మొత్తము మీద విధించబడుతుంది. ఈ Show tax, ఒక్కొక్క సినిమా హాలులో ఎన్ని shows చూపిస్తే, show ఒక్కంటికి ఇంత అని వేరే వసూలు చేయడము జరుగుతున్నది. ఉదాహరణకు ఒక హాలులో మూడు shows చూపించారనుకోండి. ఒక్కొక్క Show కు అయిదు రూపాయల చొప్పన 3x5 - 15 రూపాయలు వసూలుచేయడమనేది ఉన్నది.ఈ విషయములో హైదరాబాదులోఉన్న యాక్టుకు, ఆంధ్ర దేశములో ఉన్నదానికి బేధముఉన్నది గనుక, ఇది ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రమునకంతటికినీ ఒకే మాదిరివసూలు చేయాలని ప్రభుత్వము యొక్క ఉద్దేశ్యము. రెండు విధములైన taxes కూడ ఒకప్రాంతానికి ఇంకొక ప్రాంతానికి ఏమాత్రము వ్యత్యాసము లేకుండా ఉంటే బాగా ఉంటుందని యీ బిల్లు తెచ్చాను. ఇదేమి కొత్తగా తెచ్చిన taxes మాత్రము కావు. ఇది వరకు ఉన్న రెండు ప్రాంతాలలో ఉన్న రేట్లను సమన్వయము చేస్తూ విధించబడే పన్నులు. ఇప్పుడు ఇందులో ''ఆరు దినములు'' అనేది ఉన్నది. దీని విషయములో గౌరవ సభ్యులు కొంత ఉదార స్వభావముతో ఆలోచించమని అంటున్నాను. ఈ taxes ఎన్నో సంవత్సరములుగా ఆంధ్రలో ఉన్నవి. అలాగే ఇక్కడ తెలంగాణాలో ఉన్నది. కాని రెండు చోట్లలో యీ taxes వేరు వేరు రేట్లతో ఉన్నవి గనుక ఒకే మాదిరి రేట్లతో రెండు చోట్లలోను ఒకే రకపు యాక్టును అన్వయింప చేయటానికే ఈ బిల్లును తీసుకొనివచ్చాము. కాబట్టి 24వ తేదీనుంచిదీన్ని అన్వయింప జేస్తున్నాముగనుక వ్యవధిని waive చేస్తూ దీనిని వెంటనే consideration లోనికి తీసుకోవలసిందని కోరుతున్నాను.

శ్రీ కె. యల్. నరసింహారావు:—Mr. Speaker Sir, Sub-rule 4, Rule 97 క్రింద నేనుదీనిని లభ్యంతర పరుస్తున్నాను. దీని మీద మీరు రూలింగు యివ్వ వలసిందిగా కోరుతున్నాను.

మిస్టర్ స్పీకర్.—ఇప్పుడు యీ బిల్లు ప్యాసు కాకుండా రేపు మే నెల సమావేశములో ప్యాసు చేస్తే ప్రభుత్వానికి వచ్చే నష్టము ఏమిటి ?

డాక్టర్ బి. గోపాలరెడ్డి:— ఈ Financial year April నెల మొదటి తేదీనుంచి ఆరంభ మవుతుంది. ఈలోగా దీన్ని pass చేస్తే మంచిది. ఒక వేళ మీరు ఈ బిల్లును తీసుకోక పోయి నప్పటికినీ, యీ బడ్జెటు సెషన్ పూర్తి అయ్యే లోపల ఏదో ఒక రోజు మధ్యాహ్నము కూర్చుని, దీనిలో ఏమైనా విషయాలు ఉంటే చర్చించుకోవచ్చు. అయినా ఒక విషయము ఉన్నది. మన వెంకటేశ్వర్లు

*The Madras Entertainments Act (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958*

గారు, యింకా కొంత మంది సభ్యులు దీనిని Select committee కి refer చేస్తే మంచి దేమో. select committee లో దీని యొక్క సాధక బాధకములు అన్నీ అక్కడ విచారిస్తే బాగా వుంటుందని, అంటున్నారు Select committee కి వేయాలని అంటే, మీరు move చేయండి అని అన్నాను అది ఒప్పుకోవడమనేది తరువాత చూస్తాము అని నేను అన్నాను.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య.—ఇది ఇంకా select committee stage కి రాలేదు. opposition party వారందరు దీన్ని oppose చేస్తున్నారు.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు:— Select Committee కి refer చేస్తామంటే సరే, చేయండి అని అన్నాము.

శ్రీ కె. యల్. నరసింహారావు:— Mr. Speaker Sir, నేను point of order raise చేసి యున్నాను. దానిమీద మీరు రూలింగు యివ్వకముందే మీరు యితర సందర్భాలను గురించి మాట్లాడడము మంచిదికాదు మంత్రిగారు మార్చి నెల 24వ తేదీనుంచి పన్ను విధింపు అమలులోనికి తెస్తామంటున్నారు. దానికి ఎవ్వరు ఒప్పుకోవడము లేదు. ముందు నా point of order మీద మీరు రూలింగు యిచ్చి తరువాత మరొక విషయమును గురించి ఆలోచించండి.

మిస్టర్ స్పీకర్:—ఇప్పుడు ఉన్న ప్రశ్న యేమిటంటే, యిప్పుడు కాకపోతే నాలుగు రోజులు అయిన తరువాత ఏ మధ్యాహ్నమో పెట్టుకోవచ్చు. ఈ రోజుననే ఇది ప్యాసుకాకపోతే మునిగి పోయ్యేది ఏమీ లేదు కనుక నేను దీనిని waive చేయదలచుకోలేదు

ఇప్పుడు దీనిని select committee కి పంపటానికి మీరు అందరూ ఒప్పుకుంటే, నాకేమీ అభ్యంతరము లేదు.

శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి:— Mr. Speaker Sir, ఇప్పుడు మీరు దీనిని waive చేయను అని అంటున్నారు, అది వేరే విషయము. అసలు opposition party వారు యీ శాసనము విషయములో కొంత రాజీ మార్గము కావాలన్నారు Select committee కి పంప మంటే, ఇంకొక మూడు రోజులు వీలుగా పడుతుంది. రేపు ప్రొద్దున్న select committee వారు ఒప్పుకోరు.

మిస్టర్ స్పీకర్.—ఇప్పటికప్పుడే నాలుగు రోజులు అయినది Time limit ను నేను waive చేయను అవేదే వాయొక్క decesion. కాని నేను యివ్వ దలచుకున్న సలహా ఏమిటంటే, మీరు దీనికి Select Committee కి వేసుకుని దానికి 15 రోజులో 20 రోజులో time తీసుకుంటే మంచిది. It is only my advice.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య:—అధ్యక్షులవారి సలహాబాగానే ఉన్నది. దానిని follow అవుతాము సరే. Contrary గా ఉంటే ఎట్లాగు అని ఆలోచన వస్తుందిగాని (Interruption)

*The Madras Entertainments Act (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958.*

మిస్టర్ స్పీకర్.—మీరు అందరు దీనిని select committee కి పంపటానికి ఒప్పుకుంటే, నేను waive చేయడము అనే దానిని వదలి వేస్తాను

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య.—అలాగైతే, మేము దానిని సెలెక్టు కమిటీకి పంపటానికి ఒప్పుకుంటున్నాము.

మిస్టర్ స్పీకర్.— అలాగైతే సరే. అప్పుడు waive చేయడమనే question లేనే లేదు.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు:— ఇప్పుడు ఇది ఒక precedent గా చేయకూడదు. ఇప్పుడు ఎట్లాగో 5 రోజులు అయింది. రేపు మరల తీసుకొని రావచ్చు. మీరు consideration లోకి తీసుకోవచ్చు. ఇంకా ఏమైనా చేయవచ్చు. మీరు ఏమి చేసినప్పటికినీ, మేము మీ ఆజ్ఞకు బద్ధులమే కాని దీనిని ఒక precedent గా మాత్రము మంత్రివర్గము భావించకూడదని అంటున్నాను—

శ్రీ ఎ. వెంకటరామరాజు (రాజోలు—జనరలు) :—మనం discuss చేసిన తరువాత select committee కి వెడుతుందా, లేకపోతే నేరుగా select committee కి వెళ్లి తిరిగి మనం discuss చేయడానికి వస్తుందా? ఏదోఒక కొత్త ఆనంద భైరవి మాదిరిగా మొదలు పెట్టారు గోపాలరెడ్డిగారు. ఆనందభైరవి సంగీతం కొంతవరకూ విన్న తరువాత discuss చేయడం మంచిదా, లేక select committee నుంచి వచ్చిన తరువాత discuss చేయడం మంచిదా ?

మిస్టర్ స్పీకర్·—ఇంకా ఒక గంటవరకూ time ఉన్నది. సెలక్టు కమిటీకి పంపించడంమాత్రం నిశ్చయించుకున్నాము.

శ్రీ జి. ఎల్లమందారెడ్డి (కనిగిరి).—ఇదివరకున్న rates ను ఎక్కడ వేస్తే ఎంత ఆదాయం పెరుగుతుందో మంత్రిగారి ఉపన్యాసంలోనూ చెప్పలేదు, ఆ Annexure లో నూ లేదు.

డాక్టర్ బి. గోపాలరెడ్డి·—కాగితాలు ఇచ్చారు కదా ? అవి చూసుకోమనండి.

శ్రీ పి. నరసింగరావు (హుజూరాబాద్-జనరలు)—.అధ్యక్షా, శ్రీ కె. యల్. నరసింహారావుగారు ఈ విషయమై point of order ను raise చేసినప్పుడు దీనినిప్పుడు waive చేయము అని మీరు ఈRuling యిచ్చినారు. Private గా compromise చేసుకునిసెలెక్టు కమిటీకిపంపించడం సమంజసం కాదు. ఇది precedet దిశ లేకుండా కాబోతున్నది. రేపు move చేసిన తరువాత, ఏమీ అభ్యంతరం లేకుండా సెలక్టు కమిటీకి పంపించవచ్చు.

మిస్టర్ స్పీకర్:—అది వారి ఇష్టం. I am not responsible for that.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య —అధ్యక్షా, ఇది precedent కాదు, అనే పద్ధతిలో ఒప్పుకోవడం మంచిదని నా అభిప్రాయం.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:—Precedent కాకపోవడం మాట నిజమే. కాని యిందులో ఈషణ్మాత్రం కూడా కొత్త విషయంలేదు ఆంధ్రచట్టాన్ని తెలంగాణాకు, తెలంగాణా చట్టాన్ని

*The Madras Entertainments Act (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958.*

ఆంధ్రకు వర్తింపచేయ బోతున్నాము. కొత్త విషయం ఏమైనా ఉంటే అట్లా చేయకూడదు అని చెప్పడం న్యాయం కాని, ఏమీ లేనప్పుడు కొంచెం ఉదారంగా ఉంటే మంచిది.

మిస్టర్ స్పీకర్:—సెలక్టు కమిటీలో మాట్లాడండి. ఇక యీ విషయం అయిపోయింది.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య:—అధ్యక్షా, సెలక్టు కమిటీకి పంపించాలని నేను propose చేస్తున్నాను.

డాక్టర్ బి. గోపాలరెడ్డి.—నేను అంగీకరిస్తున్నాను.

మిస్టర్ స్పీకర్.—అయితే names ఇవ్వండి

శ్రీ కె. వెంకటరావు:—Names వ్రాస్తున్నారు. 5 నిమిషాలలో ఇస్తారు, కాని, యిది అయిన తరువాత Land Acquesition Act తీసుకొంటే మంచిది. అది చాలా ముఖ్యమైనది. ఎన్నాళ్లనుంచో ప్రతిపక్ష సభ్యులు తొందర పెడుతున్నారు. దీనికి 2,3 కంటె ఎక్కువ సవరణలు లేవు. ఒక గంటలో pass అయిపోతుంది. ఒక అరగంటలో యీ రెండు బిల్లులూ pass చేస్తామని సుందరయ్యగారు యిదివరకే flour of the house లో చెప్పినారు. అందువల్ల యిప్పుడు యిది తీసుకొంటే పూర్తి చేయవచ్చును మిగిలిన 6 బిల్లులను తరువాత తీసుకోవచ్చును.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు:—రేపు సుందరయ్యగారు కూడా వస్తారు. ఈ గంటలోనూ మనం అనుకున్న యీ వ్యవహారాలు పూర్తి అయితే వెంకట రావుగారి బిల్లు తరువాత తీసుకోవచ్చును.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య:—అధ్యక్షా, ఈ బిల్లుపై అందరూ మాట్లాడిన తరువాత కొన్ని విషయాలను వారు exhust చేయకపోతే నేను వాటిని గురించి మాట్లాడదామను కొన్నాను. అయినా యిప్పుడే మాట్లాడుతున్నాను.

తెలంగాణాలో ఉన్నవాటిని ఆంధ్రకు, ఆంధ్రలో ఉన్నవాటిని తెలంగాణాకు సమన్వయ పరచాలని కొత్త సిద్ధాంతాన్ని యీ నాడు ఆర్థిక మంత్రిగారు తీసుకు వచ్చారు.

డాక్టర్ బి. గోపాలరెడ్డి —అన్నింటినీ కాదు. కొన్ని కొన్ని మంచి Act లను మాత్రమే.

*Sri S. Ranganadha Mudaliar in the chair*

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య:— Progressive గా వుండే వాటిని ఉభయ ప్రాంతాలకు అన్వయింప జేయడంలేదు. కాని ఒక చోట ఏదైనా పన్ను హెచ్చుగా ఉంటే దానిని ఇంకొక చోటకూడ వేస్తున్నారు. ఈ Policy వల్ల ప్రభుత్వం యొక్క attitude బహిరంగ పడుతోంది.

తెలంగాణాలో యిదివరకే land reforms అమలు చేయబడినాయి, అవి ఆంధ్ర రాష్ట్రానికి కూడా అమలు జరపండి అంటే ఒక clause తో అట్లా మార్చడానికి వీలులేదని చెప్పారుకాని అక్కడ ఉన్న taxation ను ఒక్క clause తో యిక్కడకు అన్వయించవద్దు అంటే కాదు , మేము చేస్తాం అన్నారు. ఆంధ్ర ప్రాంతంలో show tax లేదు.

*The Madras Entertainments Act (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958.*

డాక్టర్ బి. గోపాలరెడ్డి.—ఉన్నది, కాగితాలు చూచుకోండి.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య —మాకు యిచ్చే కాగితాలు అమాంతంగా ఆఖరు నిమిషంలో యిస్తారు.

డాక్టర్ బి. గోపాలరెడ్డి —ఆంధ్రలో ఉన్నది. నేను చదువుతాను, వినండి.

| Andhra area: | | Telangana area. | |
|---|---|---|---|
| Exhibitions held in Municipalities. | Rs. 2 per show. | 1. Cinemas in cities | Rs. 5-0-0 per show. |
| Cinematograph exhibitions held in other Municipalities. | Rs. 1-8-0 per show. | 2. Cinemas in towns | Rs. 3-0-0 per show. |
| Cinematograph exhibitions held elsewhere. | Rs. 1-0-0 per show. | 3. Cinemas in other places. | Rs. 2-0-0 per shows. |

Show కు రూ. 2 ఉన్నది. మిగిలిన వాటికి ఆంధ్ర ప్రాంతంలో ఒక రూపాయి ఉన్నది.

తెలంగాణాలో 50 వేల జనాభాకు పైగా ఉన్న పట్టణంలో ఒక show కు రూ. 5% 25 నుంచి 50 వేలు జనాభా వరకూ ఉన్నచోట్ల ఒక show కు రూ. 3 ఇతర చోట్ల ఒక show కు రూ. 2 ఉన్నది. తెలంగాణాలోని Act చాలా ఉదారంగా ఉన్నది కాబట్టి ఆంధ్ర ప్రాంతానికి కూడా వర్తింప చేయాలని మా ఉద్దేశ్యం.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య:— ఈ రెండు విషయాలు చూసిన తరువాత ఆర్థిక మంత్రి గారు మరొక విధంగా ఆలోచిస్తే బాగా ఉండేది. ఆంధ్ర ప్రాంతంలో ఉన్నటువంటి రూ. 2 ను తెలంగాణాకు వర్తింప చేయడానికి వారికి అభ్యంతరం ఏమిటి ? అట్లా చేస్తే యింకా చాలా ఉదారంగా ఉండేదికదా ? Regressive కాకుండా Progressive attitude కనబడేదికదా.

డాక్టర్ బి. గోపాల రెడ్డి:— Progressive attitude అంటే వచ్చే ఆదాయాన్ని పోగొట్టుకోవడమేనా ? మా ఉద్దేశ్యం ప్రకారం అది Progressive attitude అంటే అర్థం అది కాదు.

*The Madras Entertainments Act (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958.*

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య :— Progressive అంటే అందరికీ ఒకటే అర్థం సామాన్య జనానికి పన్నుల భారాన్ని తగ్గించేదే Progressive attitude. ప్రజలకు యిదివర కుండే పన్నుల భారాన్ని పెంచే విధానమే regressive attitude. అయితే, యిప్పుడు Progressive atitude ఆలోచిస్తారా, regressive attitude ఆలోచిస్తారా ? ఉదారంగా ఉండాలంటే ఏ విధానం అవలంభించాలి ? ప్రజల మీద భారం వేయడం ఉదారమా, భారం పడకుండా చేయడం ఉదారమా ? ఈ విషయం బాగా పరిశీలించి చేసినట్లయితే చాలా బాగుండేది.

Entertainment Tax వసూలు చేసేటప్పుడు — ఆంధ్రప్రాంతంలో పన్నులలో కొద్దిగా మార్పులు తీసుకు వచ్చి, విద్యావిధానంలో change చేస్తాము ఒప్పుకోండి అన్నారు. అప్పుడు కొంత ఒప్పుకోవడం జరిగింది. ఈ ప్రాంతంలోకూడా విద్యా విధానంలో కొన్ని చోట్ల III From వరకూ free education యిస్తారు. కాని అన్నిచోట్లా పూర్తిగా free education యిచ్చినట్లుగా తోచదు. విద్యా మంత్రిగారికి చెబితే కొన్ని schools కు యిస్తామన్నారు.

డాక్టర్ బి. గోపాలరెడ్డి :—అధ్యక్షా, సినిమాలను గురించి మాట్లాడమంటే Schools, Secondary education, College education మొదలయినవి చెబుతున్నారు. రేపు education demand మీద యిదంతా మాట్లాడవచ్చు. కాబట్టి యిప్పుడు సినిమాల సంగతి చెపితే బాగుంటుంది.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య:— Entertainment Tax ను కొంత మార్పు చేశారు. సినిమాలు education కు కావలసిన అవసరం ఉన్నది. ఈ రెంటినీ కలిపి ఆలోచించడానికి నేను ఈ ఉదాహరణ తెచ్చినాను. మునిసిపాలిటీలలో ఈ విషయంలో కొంత మార్పు చేశారు. అట్లాగే యిక్కడకూడా మారుస్తున్నారు. అట్లా చేయడంలేదు అని మంత్రిగారు చెప్పితే మంచిదే. వేసే పన్నులు మాత్రం ఒకదానికొకటి భారాన్ని పెంచేవిగా ఉండకూడదు. అట్టి విధానాన్ని మేము oppose చేస్తున్నాము. దానిని సెలెక్టు కమిటీకి పంపిస్తామన్నారు. కనుక, అక్కడ చర్చ చేద్దామంటే నాకు ఏమీ అభ్యంతరం లేదు. సెలక్టు కమిటీకి పంపడానికి మంత్రిగారు అంగీకరించారు. కనుక అక్కడ సమగ్రంగా చర్చిద్దాము.

శ్రీ బసవ మానయ్య (అంధోలు) :—అధ్యక్షా, Madras Entertainment Tax 1939 ను గోపాలరెడ్డిగారు విశదీకరించారు. ఇందులో పాత విషయం ఒక్కటికూడా లేదని నేను చెప్పగలను.

*Mr. Chairman.* The question is whether the Bill should be refferred to the Select Committee.

శ్రీ బసవమానయ్య:— సెలక్టు కమిటీకి పంపించాలనే చెబుతున్నాను. ఈ బిల్లులో అన్ని కొత్త విషయాలే ఉన్నాయి. ఆంధ్ర ప్రాంతంలో show Tax లేదు.

*The Madras Entertainments Act (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958.*

డాక్టర్ బి గోపాలరెడ్డి:—ఉన్నది. మద్రాసులో మొట్టమొదట మేమే ఈ బిల్లును తెచ్చాము. ఆ తరువాత హైదరాబాదు ప్రభుత్వం పెట్టింది ఇప్పుడు ఆంధ్ర ప్రాంతంలో ఉన్నది. రూ. 2-0-0 1—8—0, రూ. 1—0—0, ఈ విధంగా rates ఉన్నాయి.

శ్రీ బసవమానయ్య:—ఎక్కువ చేయడమే కొత్త విషయం. ఆంధ్ర ప్రాంతంలో Show Tax తక్కువగా ఉన్నది. కనుక తెలంగాణా ప్రాంతంలో ఉండే Show Tax ను ఆంధ్రకు వర్తింపచేయడమే కొత్తగా ఎక్కువచేయడమన్నమాట.

తెలంగాణాలో గ్రామ పంచాయతీలకు, మునిసిపాలిటీలకు, కార్పొరేషనులకూ, రాబడి విషయం లో సంపూర్ణ అధికారం ఉండేది.

కాని 1952 వ సంవత్సరములో హైదరాబాదులో చేయబడిన చట్టాన్ని రద్దు చేసి ఆంధ్ర ప్రాంతంలో ఉండే 1939 Act ను తీసుకువస్తున్నారు. 80% మాత్రమే యివ్వబడుతుంది.

అంటే ఇక్కడ 20% కోత విధానం ప్రారంభమవుతున్నదన్నమాట

డాక్టర్ బి. గోపాలరెడ్డి:—కార్పొరేషన్‌లకు గాని, మునిసిపాలిటీలకు గాని, పంచాయితీలకుగాని 1957 మార్చి ఆఖరు వరకు ఎంత వచ్చిందో అది మేము గ్యారంటీ చేస్తాము. అదిగాని, 80% గాని ఈ రెంటిలో ఏది ఎక్కువైతే అది ఇస్తాము.

శ్రీ బసవ మానయ్య.—రాబోయే సంవత్సరములలో జనసంఖ్య ఎక్కువ కావడం వల్లగాని, సినిమాలు బాగు పడడంవల్లగాని రాబడి ఇంకా ఎక్కువగా రావచ్చును. మున్సిపాలిటీలలో ఇప్పుడు ఒక విధమైన ప్రభుత్వం ప్రారంభం కాబోతున్నది. అది ఒక నూతన కాండము. అయితే ప్రభుత్వం తెలంగాణాలో ఎక్కువగా ఉన్న పన్నులను ఆంధ్రలో, ఆంధ్రలో ఎక్కువగా ఉన్న పన్నులను తెలంగాణాలో అమలు జరపడం న్యాయంగా లేదు. ఈ సమన్వయ ధోరణి ఏరాగానికి సంబంధం లేనటువంటిది. ఇది ఒక కొత్త రాగం. ఇందువల్ల ప్రజల మీద పెద్ద భారం పడుచున్నది. 16 బిల్లులలో ఈ ఒక్కదానినే సెలెక్టు కమిటీకి పంపుటకు గోపాలరెడ్డిగారు ఒప్పుకున్నారు. 24వ తారీఖునే గజిట్‌లో వచ్చిందనే కారణం చేత వారుబహుశ ఒప్పుకొని ఉండవచ్చును. ఈ సెలెక్టు కమిటీలోనైనా కొంచెం ఎక్కువ చేయకుండ బాగా ఆలోచించి ఈ ఉన్న సౌకర్యములను 5,10 సంవత్సరముల వరకు ఉండనిస్తారని నమ్ముచున్నాను. తెలంగాణావారు ఆంధ్రప్రదేశ్ ఏర్పడడంవల్ల మరికొన్ని సౌకర్యములు కలుగునని పెద్ద ఆశపెట్టుకొని ఉన్నారు. కాని మొదటి సంవత్సరంలోనే ప్రజలలో సంక్షోభం కలుగునట్లు పన్నులు పెంచుచున్నారు. కాబట్టి పేదలకు మేలు కలుగునట్లు చేస్తారని నమ్ముతూ సెలవు తీసుకొంటున్నాను.

శ్రీ గోపిడి గంగారెడ్డి:—అధ్యక్షా, ఇప్పుడు సినిమాలనుండి పంచాయితీలకు , మున్సిపాలిటీలకు వచ్చే ఆదాయమును ప్రభుత్వం ఈ బిల్లు ద్వారా స్వాహా చేయడానికి ప్రయత్నం చేస్తున్నారు. పైగా సమన్వయం తప్ప మరేమీ లేదని చెప్పుచున్నారు. పురపాలక సంఘాలు నడవనీయకుండా చేస్తున్నారు. ఇది అంతా ఒక కోమటి బేరముగా కనబడుచున్నది.

*The Madras Entertainments Act (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958.*

డాక్టర్ బి. గోపాలరెడ్డి:—ప్రస్తుతం మున్సిపాలిటీవారు టాక్సులను తగినంతగా పెంచుకోలేక పోతున్నారు. ఇప్పుడు వరంగల్‌లో $12\frac{1}{2}\%$, సికిందరాబాదులో $12\frac{1}{2}\%$ హైదరాబాదులో 20% ఉన్నది. అంతకంటే ఎక్కువ చేస్తే అక్కడ ఉండే కౌన్సిలర్లు అభ్యంతర పెడతారు. సినిమా యజమానులకు ఆక్షేపణ ఉంటుందనే భావంతో టాక్సును వారు ఎక్కువ చేయలేక పోతున్నారు. వారికి ఇంకా ఎక్కువ సంపాదించిపెట్టాలనే ఉద్దేశ్యం చేత చేస్తున్నాం గాని వారిని మోసం చేయాలనే ఉద్దేశంతో కాదు. 1956—57లో ఎంత వస్తుందో అది గ్యారంటీ చేయబడుతుంది.

శ్రీ గోపిడి గంగారెడ్డి:—ఇది కోమటి సమాధానం చెప్పినట్లున్నది. "కంది పప్పు ఉన్నదా. సాహుకారూ అంటే కంది పప్పు అది దారుణంరా బిడ్డా, పెసరపప్పు తీసుకెళ్ళు"అని అన్నాడట ఆ సాహుకారు. ఆ విధంగా ఉన్నది ఈ గోపాలరెడ్డిగారి సమాధానం. ఏది ఎక్కడ ఎక్కువ ఉంటే దానిని రెండవ ప్రాంతంలో వేస్తున్నారు. ఈ అసలు విషయమును కప్పి పుచ్చి చిన్న పిల్లలముందు చమత్కారం చేసినట్లు తన అధికార బలంచేత వీటినన్నింటిని దిగ్విజయం చేయించుకొంటూ పోతున్నారు. దీనిని సెలెక్టు కమిటీకి పంపవలయునని కోరుచున్నాను. . . . . . . . .

డాక్టర్ బి. గోపాలరెడ్డి:—సెలెక్టుకమిటీకి పంపబడుచున్నది. వారు ఏమి చేయాలో కొన్ని సూచనలు చేయండి.

శ్రీ గోపిడి గంగారెడ్డి:—సెలెక్టు కమిటీలో ఎవ్వరుంటే వారే చేస్తారు.

శ్రీ జి లక్ష్మారెడ్డి:— (మైదారం) అధ్యక్షా, ఇప్పుడు ఆర్థిక మంత్రి గోపాలరెడ్డిగారు తెచ్చిన బిల్లును సెలెక్టు కమిటీకి పంపవలసిన అవసరం నాకేమీ కనుపించడంలేదు. దీనిలో అభ్యంతరంగాని తెలంగాణావారి మీద పెద్దగా పన్ను వేయడంగాని లేదు. తెలంగాణా వారికి ఏ మాత్రం నష్టం లేకుండా 1956—57లో వచ్చిన మొత్తమునకు గ్యారంటీ ఇస్తున్నామని ఆర్థిక మంత్రిగారు చెప్పుచున్నారు. కాబట్టి ఎవ్వరికి ఎలాంటి అభ్యంతరం ఉండకూడదు. మున్సిపాలిటీవారు పన్ను పెంచుకోలేని స్థితిలో ఉన్నందున, ప్రభుత్వం హెచ్చుపన్నువేసి, సక్రమంగా రాబట్టుకొని, వారికి ఇవ్వవలసినవాటా వారికిచ్చిమిగిలినది అభివృద్ధి కార్యక్రమాలు సాగించుటకువినియోగించుకోవచ్చు. దీనిని అపార్థంచేసుకోవద్దని సభ్యులకు మనవి చేస్తున్నాను. ఇప్పుడు తెలంగాణాలో ఉన్న రేటును ఆంధ్ర ప్రాంతానికి వర్తింప చేయుటవల్ల అక్కడి మున్సిపాలిటీలకు హెచ్చు ఆదాయం వచ్చుటకు వీలున్నది. అందుచేత దీనిని సెలెక్టుకమిటీకి పంపకుండానే పాస్ చేయవలసింది. సెలెక్టు కమిటీలో ఎలాంటి మార్పులు లేకుండా దీనిని యథాతథంగా అంగీకరిస్తారని ఆశిస్తూ విరమిస్తున్నాను.

శ్రీ వి. కె. నాయక్ (సుల్తాన్ బజార్):—అధ్యక్షా, ఈబిల్లును సెలెక్టు కమిటీకి పంపిన తరువాత వారి విచారణకు కొన్ని సూచనలు చేయవలసిందిగా ఆర్థిక మంత్రిగారు అడిగినారు. Tax Enquiry Committee report ప్రకారం ఇది local self govt. విషయములో encroachment ఔతుందా ? లేదా ? అనే విషయం చూడవలసి ఉన్నది. పోయిన session లో Local-self. govt ను కార్పొరేషన్లకు సంప్రదించకుండానే "Surcharge on Property"

బిల్లును పాస్ చేయడం జరిగింది. వారికి కొన్ని అధికారములున్నవి. వాటికి సంబంధించిన విషయము లలో సంప్రదించి ప్రభుత్వం ఏ చర్యనైనా తీసుకోవలయును. ఇది ఎవ్వరికీ నష్టములేదని చెప్పుచున్నారు. తరువాత ప్రజలలో ఎలాంటి అసంతృప్తి కలుగకుండ మున్సిపాలిటీలకు, కార్పొరేషన్లకు ఆదాయమును కలుగ జేస్తుందని చెప్పుచున్నారు. కనుక ఈ బిల్లును వివాదం లేకుండ ఒప్పుకోవలయును.

ఆ విషయమును గురించి encroachment ఎందుకు అవసరమో విచారించవలసివుంది. ఈ encroachment లో 5% అని, 3 % అని, 1% అని ఈ తేడాలు ఎందుకు వున్నాయోకూడా తెలియటం లేదు.

*Dr. B. GopalaReddy:* In Bombay, it is purely a Government tax and they do not share it with local bodies; and in Madras it is collected by the Government and 90% is given to the local bodies. In Bombay they do not give anything at all.

శ్రీ వి కె. నాయక్:—బొంబాయిలో లోకలు గవర్నమెంటు యొక్క ఫైనాన్షియలు టాక్సేషన్ ఎన్క్వయిరీ కమిషన్ వారిచ్చిన ప్రివిలేజస్ encroachment అవుతాయో లేదో, ఏ ప్రివిలేజస్ను ఇచ్చిందో మంత్రిగారు చెప్పగలరా ?

డాక్టర్ బి. గోపాలరెడ్డి:—టాక్సేషన్ ఎన్క్వయిరి కమిషన్ చెప్పింది, సుప్రీం కోర్టు జడ్జిమెంటుకాదు వాటిని పరిశీలించి, అనుకూలంగా వుంటే అంగీకరించబడుతుంది. లేక-పోతే త్రోసివేయబడుతుంది.

శ్రీ వి. కె. నాయక్:—ఎన్క్వయిరి కమిషన్ వారు చెప్పిన వాటిలో కొన్నిటిని మనముకూడా మన ఎక్సైజరీ బోర్డులో పెట్టుకొందాము. సుప్రీం కోర్టు జడ్జిమెంటునే అనుసరించాలి అనుకొంటే ఈ ఎన్క్వయరీ కమిషన్స్ను ఏర్పాటు చేయటం అనవసరమవుతుంది. In that Case, there will be "Omissions", and not "Commissions".

దీనిని సెలెక్టుకమిటీకి పంపేముందు కార్పొరేషన్స్కు, లోకల్ సెల్ఫు గవర్నమెంటు విచారణకు పంపటం అవసరమని తెలియజేస్తున్నాను.

డాక్టర్ బి గోపాలరెడ్డి:— ఈ విషయము చాలాకాలమునుండి ఆలోచనలోవుంది. జంట నగరాలలోని ఇద్దరి మేయర్సును వరంగలు మునిసిపలు చైరమన్ను, కమీషనర్స్ను పిలిపించి, కాన్ఫరెన్సు పెట్టుకొని, ఆమోదించటం జరిగింది. ఎవరినీ సంప్రదించకుండా ఇది చేయుటం జరుగలేదు.

శ్రీ వి. కె. నాయక్:—ఈ సంగతి మంత్రిగారు ముందు చెప్పివుంటే బాగావుండేది. ఈ tax ఇక్కడ ఎక్కువ వుందని, అక్కడ తక్కువ వుందని ఫైనాన్షియలు స్టేటుమెంటులో ఎక్కడా చూపించలేదు. ఆంధ్రలో రేటు తక్కువగావుండటం వల్ల ఎంత వస్తున్నదో తెలంగాణాలో రేటు ఎక్కువగా వుండటంవల్ల ఎంత వస్తున్నదో ఫైనాన్షియలు కలెక్షన్ స్టేటుమెంటులో ఇచ్చివుంటే మాకు చెప్పే అవకాశం కల్గేది. ఆంధ్రలో ఎక్కువచేస్తే ఎక్కువ రెవెన్యూ వస్తుందనే అనుమానం ఒకటి వుంది. ఇంతవరకు ఏదోవిధంగా equalisation of taxes అని చెప్పి 16 బిల్లులను

ప్రవేశ పెట్టటం జరిగింది. ఈ tax ను తీసుకొని రెవెన్యూను ఎక్కువ చేయాలని ప్రభుత్వము అభిప్రాయ పడుతోంది. రెవెన్యూ ఎంత వస్తుందో చూపిస్తే దానిని సెలెక్టు కమిటీలో మేము పరిశీలించటానికి వీలు వుంటుంది ఇంత tax వేస్తే ఇంత ఎక్కువ వస్తుందని, ఆలోచించటం business Policy అవుతుంది. ఈ business Policy మీద discuss చేయటము అవసరమని నేను భావిస్తున్నాను. ఈ బిల్లు సెలక్టు కమిటీకి వచ్చినప్పుడు ఎంత ఆదాయం వస్తుందో Statement of accounts ను చూచి విచారణ చేయవలసివుంటుంది.

ప్రతి పన్నుల భారము ప్రజల మీద పడుతోంది. ఆ భారాన్ని ప్రజలు భరించగలరా ? లేదా అని ప్రజలు ఆలోచించాలి. అటు సినిమా ఇండస్ట్రీకి, ఇటు కన్స్యూమర్స్‌కు చెందేటట్లు ఈ రెండు విషయములు ఆలోచించటానికి ఆదాయం లెక్కలు అవసరమని తెల్పుతూ, సెలెక్టుకమిటీకి వెళ్ళి వచ్చిన పిదప మరల ప్రతిపాదిస్తే బాగుంటుందని మంత్రిగారికి తెలియచేసు న్నాను.

శ్రీ జి. ఎల్లమందారెడ్డి:— అధ్యక్షా, మం త్రిగారు మనకొకస్టేట్ మెంటును ఇచ్చారు. ఇక్కడవున్నది అక్కడ, అక్కడఉన్నది ఇక్కడ వేస్తున్నామని వారుతెలిపారు. కొన్ని అణాలు కలుస్తే రూపాయి అవుతుందనే సిద్ధాంతము గల మంత్రిగారు కొద్దిమొత్తంపెరిగినా చాలునని ఈవిధంగాచేస్తున్నారు. Enhancement of Taxes గా వుందికాని administrative గా సర్దుపాటు చేస్తున్నట్లు కన్పించటములేదు. గౌరవసభ్యులు లక్ష్మణదాస్‌గారు చాలావిచిత్రంగా మాట్లాడారు. ఏవిషయం మాట్లాడుతున్నారనే విషయం ఆలోచించకుండా opposition వారు చెప్పిన ప్రతిదానిని వ్యతిరేకించి మాట్లాడటమే వారికి అలవాటు. ఆంధ్రలో 2రూ. వుంటే తెలంగాణాలో 5రూ. వుంది. అక్కడ $1^1/_2$ రు. వుంటే ఇక్కడ 3రు. వుంది. అక్కడ 1రు.వుంటే ఇక్కడ2రు.వుంది కనుక సమానంచేస్తే ఆదాయంతప్పక పెరుగుతుందని ఆర్థిక మంత్రిగారు చెప్పారు. వారిచ్చిన స్టేటుమెంటు ప్రకారం 33 1/3% maximum rate వుంది. సికింద్రాబాద్ 21%వుంది. ఒక పక్క పెంచుతున్నట్లు కన్పిస్తున్నా "అదిపెంచటముకాదు. ప్రతిపక్ష సభ్యులు అలాఅనుకుంటున్నారు." అనిలక్ష్మణదాస్‌గారు చెప్పటం సమంజసముగాలేదు. Integration of laws అని చెప్పి 0—4—0 పెరిగినా పెరిగినట్లే అనే ధోరణిలో సమంజసమైనది కాదని మంత్రిగారికి మనవిచేస్తున్నాను. ఫైనాన్షియలు మెమోరాండములో, ఖర్చులక్రిందను 20% తీసుకొంటున్నామని మంత్రిగారు చెప్పారు, ఆ 20% ఖర్చు అవుతుందా అని నాకు అనుమానముగావుంది.

డాక్టర్. బి. గోపాలరెడ్డి:— ఖర్చులు పోగా నికరాదాయం ఇంతఅని వారు గ్యారంటీ లెక్క ఇస్తున్నారు. అందులో 20% మేము మినహాయించు కొంటున్నాము. 20%ఖర్చు అవుతున్నదని మేముచెప్పలేదు. మినహాయించుకుంటున్నామని మాత్రమే చెప్పాము.

శ్రీ జి. ఎల్లమందారెడ్డి:— Madras Act లో మాదిరిగా 10% మినహాయించుకొని 90% లోకలు బోర్డులకు ఇస్తేబాగుంటుందని మాఅభిప్రాయము. ఆయాడిపార్టుమెంటులకు ఇవ్వాలని పన్నులు వేయటమే కాని ఆవిధంగా ఇవ్వటం జరగటంలేదు. లాండ్ రెవిన్యూలో 12% ఇవ్వాలని చట్టంలో వున్నా ఆవిధంగా ఇవ్వటంలేదు. ఈ బిల్లులో మద్రాసు చట్టం మాదిరిగా 10% తీసుకోవటం ఉచితంగావుంటుంది. Integration అనో, adjustment అనో

*The Madras Entertainments Act (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958.*

salestax అనో ఏదోపేరుపెట్టి ప్రతిదానిలో కూడా పెంచుతున్నారు. ఆవిధంగా జరుగకూడదనే మేము చెబుతున్నాము. ఎక్కడఎక్కువగా వుంటుందో దానిని అమలు జరుపాలనే పాలసీ సరైనదికాదు. సికింద్రాబాద్‌లో పూర్వం డ్రామాకువెళ్ళినప్పుడు తక్కువగావుండేది. సినిమాలకు ఎక్కువగా వుండేది. ఇప్పుడు రెండింటి పై ఎక్కువ వేయటం జరిగింది. ముందుగానే డ్రామాకు ఇంత డబ్బు, సినిమాకు ఇంతడబ్బు, కుస్తీకి ఇంతడబ్బు అని నిర్ణయించుకొని పన్నువేయాలి. అంతేగాని ఎక్కువవున్న వాటిని సమానముచేయటము fundamental Correct కాదని నేనుమనవిచేస్తున్నాను.

అందువల్ల ఈబిల్లు యిట్లా ఉన్నప్పుడు క్రొత్తబిల్లును పెట్టడమో లేక రెంటిని సమన్వయము చేయడమో అవసరం. కాని బిల్లును ఈవిధముగా split చేయడం మంచిది కాదు. అవసరంఅయితే క్రొత్త బిల్లును తీసుకొనిరావాలి. ఈవిధంగా చేస్తే పన్ను జాస్తి అవుతోంది. ఇకమీదట అయినా average కట్టి, సరిగా చేస్తారని మనవి చేస్తున్నాను

శ్రీ బి. శంకరయ్య — అధ్యక్షా,నిన్న బడ్జెట్‌ను ప్రవేశపెడుతూ ఆర్థికమంత్రిగారు పన్నులు ఏమీ ఉండవని చెప్పారు. కాని అన్నిపన్నులు ఈ 58 వ సంవత్సరములోనే వేస్తున్నారు.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:—నేనుచెప్పింది 1st April నుంచి, అంటే Budjet year నుంచి అని చెప్పాను.

శ్రీ బి. శంకరయ్య:—మొత్తం మీద మీరు వేసినపన్నులు అన్నీ 1958 లోనే వేశారు. దీని effect April కే వస్తుంది. అందుకోసమే బడ్జెట్‌లో కొత్తపన్నులు చూపించలేదు.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:—అయితే మార్చిలోనేఅమలులోకి తీసుకురమ్మంటే తీసుకొనివస్తాను.

శ్రీ బి. శంకరయ్య:—ఇప్పుడు ఇంటిగ్రేషన్ పేరుతో ఈవిధముగా పన్నులు పెంచుతున్నారు. పైగా బడ్జెట్ లో పన్నులు ఏమీ పెంచలేదని చెబుతున్నారు. దీనినే దొడ్డిదారిన పెంచడం అనవచ్చు. ఇంకొక ముఖ్యవిషయం. తెలంగాణా ప్రాంతంలో యిదివరలో యీ పన్నులు లోకల్ బాడీస్ వసూలు చేయడం జరిగేది. ఇప్పుడు ప్రభుత్వమే తీసుకొంటోంది. అయితేమద్రాసులో ఈ Entertainment Tax లో 90% లోకల్ బాడీస్ కు యిస్తున్నది, యిక్కడ 80% యిస్తున్నాం. బొంబాయిలో ఏమీ ఇవ్వడం లేదని comparative గా చెప్పారు కాని బొంబాయిలో Land Revenue tax ఎక్కడాలేనంత ఎక్కువగా తీసుకొంటున్నారు. ఈరోజున ప్రభుత్వానికిఖర్చులు ఏవిధముగా పెరిగిపోయినవో అదేవిధముగా లోకల్ బాడీస్‌కు, కూడాపెరిగిపోయినవి. వానికూడాచేయవలసిన పనులు చాలా వున్నవి. ఈ రోజున జిల్లాబోర్డులకు ఎలక్షన్సులేకుండా ఉన్నాయి. కారణమేమంటే డబ్బులేదంటున్నారు. ముఖ్యంగా ఆ జిల్లాలో స్కూల్సు, హాస్పిటల్సు, రోడ్లుమొదలైనవన్నీ. ఈ జిల్లా బోర్డులే చూస్తున్నాయి, ఇవన్నీ సక్రమంగా జరగాలంటే జిల్లాబోర్డులకు కూడ, డబ్బులవసరం. అంతేకాకుండా ప్రజాసహకారం ఎక్కువగా మన పంచవర్ష ప్రణాళికకు చేకూరాలంటే జిల్లాబోర్డులు బాగాపని చేయాలి. అందువలనపూర్తిగా ఈ Emtertainment tax లోకల్ బాడీస్‌కే ఇచ్చివేయాలని కోరు

*The Madras Entertainments Act (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958.*

తున్నాను. అంతేగాక, కేంద్ర ప్రభుత్వం ఇచ్చేటటువంటి గ్రాంట్సు నుంచి కూడా కొంత మొత్తాన్ని అధికంగా సహాయంచేయాలని మనవిచేస్తున్నాను. Intigration of laws పేరుతో ప్రభుత్వం ఏవిధంగా డబ్బుసంపాదించుటకు ప్రయత్నించుచున్నదో ఆదేవిధముగా లోకల్ బాడీస్‌కు, కూడ ఆశఉంటుంది, ఇట్లా వుండడం, న్యాయమే! ఈ విషయం కూడ సెలక్టు కమిటీ consider చేయాలి ఈ పన్నును రాష్ట్ర ప్రభుత్వం వసూలుచేసినా ఆవసూలుచేసిన ఖర్చులు మాత్రం తీసుకొని మిగతాది లోకల్ బాడీస్‌కు ఇచ్చెయ్యాలి. ఇప్పుడు 20% రాష్ట్ర ప్రభుత్వం తీసుకొంటోంది. ఈపన్ను వసూలుకు ప్రభుత్వానికి అంతఖర్చుఅవుతున్నదని మంత్రి గారుకూడ చెప్పలేకపోయినారు. ఇంకొకముఖ్యవిషయం, ఈప్రభుత్వదృష్టికి తీసుకొనివస్తున్నాను. అయిదు అణాల టిక్కట్టుపైన 25% పెంచారు. ఒక హైదరాబాదు సికింద్రాబాదు నగరాలను విడిచిపెట్టి నట్లయితే మిగతా రాష్ట్రంలో ఉండే, అత్యధిక ప్రజానీకం ఈ అయిదు అణాల టిక్కెట్టునే కొంటుంది. అంటే ఈ పెంచిన Tax సామాన్య ప్రజానీకంమీదనే పడుతున్నదని అర్థం. ఇది చాలా అన్యాయమైన విషయం. ఈసామాన్య ప్రజానీకంపైన, పడే Tax నుతీసివేయవలసినదని కోరుతున్నాను. ఇట్లాపన్నులు ఊరికేపెంచుకుంటూ పోవడం కంటె, వేసినపన్నులను సక్రమం వసూలుచేయుటకు శ్రద్ధవహించినచో ప్రభుత్వానికి యిప్పుడువచ్చేపన్నులు కంటె ఎక్కువఆదాయంరాగలదు. సరిగా చూచి నట్లయితే, ప్రభుత్వ అంచనాల ప్రకారం పన్నులు వసూలుకావడంలేదు. అందుకోసం ఈ ప్రభుత్వానికి నాది ఒక్కటే విజ్ఞప్తి. క్రొత్త పన్నులు వేసేకంటే, వేసిన పన్నులు సక్రమంగా వసూలుచేయుటకుపూనుకొనుట, అట్లు సక్రమంగా వసూలు కాకపోయినదానికి గల కారణములను, అన్వేషించుటలో శ్రద్ధ వహించవలసినదని, కోరుతున్నాను. అందువల్ల షెడ్యూలులో ఉన్నటువంటి రేటును తగ్గించటానికి ప్రయత్నించాలి. ఈ విధంగా రెండు ప్రాంతాలలోను కూడ తగ్గించ డానికి ప్రయత్నించాలి, దీనివల్ల ఏమీపెరగటం లేదని లక్ష్మణదాస్‌గారు అన్నారు. 12% ఉన్నదానిని20%కు పెంచుతున్నాము అంటే రెట్టింపు పెరుగుతోందన్నమాట. ఈపన్నుమాత్రం డైరక్టుగాప్రజలమీదపడుతోంది. అందులో పేద ప్రజానీకంపై పడుతోంది, కాబట్టి దానిని తొలగించాలని మరొకసారి విజ్ఞప్తి చేస్తున్నాను. ఈ పెంచినదానివల్ల హెచ్చుపన్ను సామాన్య ప్రజలమీద పడుతున్నది. కాబట్టి దీనిని సెలెక్టు కమిటీకి పంపమని కోరుతున్నాను,

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు (వదమలపేట):—అధ్యక్షా, ఈబిల్లును గురించి కొన్నిసందేహాలను తీర్చుకొనుటకు నేనుమాట్లాడ దలిచాను, గౌరవనీయులైన మంత్రిగారు మాట్లాడినప్పుడు నేను ఇక్కడలేను. బహుశా మంత్రిగారు చెప్పినవే నేనుఏమైనా చెప్పిన, నన్నుమన్నించమని కోరుతున్నాను.

ఆరవ క్లాజులో inclusive అన్నదానికి బదులు "exclusive"అని ప్రభుత్వం సవరణ తెచ్చారు. బహుశా దీనివల్ల కొంచెం ఆదాయంవస్తుందని వారిఉద్దేశ్యం కావచ్చు.

*(Mr. Speaker in the Chair)*

డాక్టర్ బి. గోపాలరెడ్డి:—ఇప్పుడున్న Andhra Act ప్రకారం సినిమాలకు మాత్రం టికట్ Rs. 1—8—0 అయినదానిపైన Entertainment Tax వుంది. మిగతా వాటిని అంటే, Tennis, కుస్తీలు మొదలైనవాటికి Re 1—0—0 టిక్కెట్టు ఖరీదు

Rs 0—8—0 Entertainment Tax సినిమాలకు కొంచెం concession వున్నది. మేము ఇప్పుడు ticket plus tax అని పెడదామనివుంది. దీనివల్ల గవర్నమెంటుకు కొంచెం నష్టమయినా tax ను uniform చేద్దామనే ఉద్దేశ్యంతో మేము చేశాం.

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు:— " Exclusive " అని వుంటే ప్రభుత్వానికి నష్టమెట్లా?

డాక్టర్ బి. గోపాలరెడ్డి —యిప్పుడు ticket Rs. 1—8—0 అనుకోండి. Tennis కు Re 1—0—0 ticket, Rs 0—8—0 tax అవుతుంది. అదేఖరీదు సినిమాకైతే ticket Rs. 1—8—0 అవుతుంది. దానిపైనవారు tax collect చేసికోవచ్చు. లేక 25% tax గాయిచ్చుకోవచ్చు. కాని అది $33\frac{1}{3}$% కాదు.

*Sri R.B. Ramakrishna Raju:* If it is tennis match, and it is exclusive of the amount of tax more will have to be paid. Suppose if the ticket is Rs. 1-8-0 he will have to pay 1/5 extra.

*Dr. B. Gopala Reddy* ·— Rs. 1—8—0 కు పైన అయినప్పుడు "inclusive of the tax". If it is a tennis match and if Rs. 1-12-0 is collected from the customer, he must pay 33 1/3 per cent as tax.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు:— సినిమాలకుఎట్లా?

డాక్టర్ బి. గోపాలరెడ్డి:— సినిమాఅయితే tax is exclusive Ticket ఖరీదెంత అయినప్పటికీ Tax at one third is extra.

*Sri R.B. Ramakrishna Raju:* Let us confine ourselves to clause 6 (i) "Where such payments (inclusive of the amount of the tax)" is not more than 5 As, the rate of tax is one fifth of such payment. "Now if that is converted as "exclusive of the amount of tax, that means some thing more.
దీనివల్ల tax జాస్తీవస్తుందన్నమాట.

*Dr. B: Gopala Reddi:* The customer has to pay more. If the customer is prepared to pay more, of course the Government may also get. But as you know; as we go up. There would not be many people to purchase higher tickets.

*Sri R.B. Rumakrishna Raju:* Let us go item by item. When it is five annas, one fith is one anna. But if it is 'exclusive for one fifth, he will have to pay one fifth of five annas. So, when the payment is 30

naye paise inclusive, 30 naye paise include the original 4 annas to the Owner of the entertainment and one anna to the Government. But now it is five annas to the owner. only which the Government will get no money so the Customer will have to pay more.

*Dr. B. Gopala Reddy.* I cannot explain of here. But if the Hon. Member comes, we shall Calculate and show that what we are trying to do is we are foregoing a little revenue. That means giving relief to the Customer.

*Sri R.B, Ramakrishna Raju.* I am not able to understand it quite clearly.

శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి (నెల్లూరు):— ఇప్పుడు అయిదు అణాలని వున్నది. ఇంతకుముందు 4 అణాలకు ఒకణాకలిపారు ఇంతకుముందు ticket 4 అణాలే. As one fifth of 0-4-0 is less than one annna. They added one anna to the charge. ప్రస్తుతపు tax ప్రకారం 0—4—0 ticket అవుతుంది. దానిమీద one fifth 5 వ వంతు పన్ను వుంటుంది. అందువల్ల మొత్తముమీద charge తగ్గుతుంది,

*Sir. R. B. Ramakrishna Rarju*: Suppose the ticket is Rs. 0-5-0, the Customer will have to pay Re. 0-6-0.

*Sri A.C. Subbareddy*: Suppose the ticket is Re 0-6-0 the customer will have to pay more. That is always same.

*Sri R.B. Ramakrishnaraju.* Anyway I should think that exclusive means a little more to the customer.

తరువాత dramatic and music performonce మొదలైనవాటికి వేరేతగ్గించారు. ఇదివరకు మంత్రిగారు మదరాసులో మంత్రిగావున్నప్పుడు dramatic మొదలైన performances అన్నిటికీ exemption ఇచ్చినట్లు నాకు జ్ఞప్తి. ఇప్పుడు philanthropic and religious and charitable purposes అనివున్నది. ఈ exemption డ్రామాలు మొదలైనవి ఎవరు వేసిదా యిస్తారా, లేక సంస్థలు వేసినమాత్రమే చేయిస్తారా ?

డాక్టర్ బి. గోపాలరెడ్డి:—డ్రామాలు, నాటకాలు, సంగీతము మొదలైన వాటి గవర్నమెంటుకు వున్న power క్రింద exemption యిచ్చారు. ఆ exemption ప్రస్తుతం 31st Marchకు మాత్రమున్నది. from year to year it is being extended తరువాత Tennis మొదలైనవి. యే educational institution అయినా arrange చేస్తే వాటికి కూడా exemption యివ్వవచ్చు.

*Sri. R.B. Ramakrishna Raju*: In Section 8 (a) it is said that the Government may grant exemption if the entire gross proceeds of enter-

tainment are devoted to philanthropic or religions or charitable purposes without any charge on such proceeds for any expenses of the entertainment. ఈ క్లాజు క్రింద మాత్రమే మీరు exemption యివ్వగలరు.

Next in section 8 (c), which is now amended, it is said that exemption can be given of the entertainment is wholly or partly educational, cultural or Scientific in character and is provided by an institution, etc. How can we say that an entertainment for an educational purpose?

I think the dramatic or music performances are all exempt as it is.

*Dr. B. Gopala Reddy*: Not under the Act; but we have exercised our residual power.

*Sri R B. Ramamakrishna Raju*: So that is all right. So the Government have got residual power also to exempt.

*Dr. B. Gopala Reddy*: Yes to exempt, but not to tax without the approval of the Legislature.

*Sri R.B. Ramakrishna Raju*: All right, if it is said, as it is now amended, without any charge on such proceeds for any expences' it will be a difficult condition.

డ్రామావేయాలన్నప్పుడు కొంతఖర్చు అవుతుంది. కాబట్టి expenses పోయిన తరువాత మిగిలిన దానిమీద exemption ఇస్తే బాగుంటుంది. " with out any charge on such proceeds " అంటే అదినిజమైన exemption కాదు. కాబట్టి ఆ clause ను ప్రభుత్వం గమనించి తీసివేయాలని కోరుతున్నాను. ఒక ప్రదర్శన Educational, Cultural or Scientific purposesకు అయినపుడు ఖర్చులు భరించక పోతేఎట్లా?

డాక్టర్ బి. గోపాలరెడ్డి:—కుమారి వైజయంతిమాలను హైదరాబాదుకు పిలిపించారు, అమ కోండి. వెయ్యిరూపాయలు వసూలైంది. దానిలో Rs 900/— ఆమెకు ఇచ్చి Rs 100/— ఏ sanskrit school కోయిచ్చి exemption కోరతారు. అలాంటివారికి exemption యివ్వకూడదు. ఖర్చులకు మాత్రంవేరేచందాలు వసూలు చేసుకోవలసివుంటుంది. collect అయిన వెయ్యిరూపాయలు సంస్కృతపాటశాలకు యిస్తేనే exemption వస్తుంది లేకపోతే entertainment tax తప్పించు కోవడానికి benfit performances అని ప్రతిదానికి exemption కోరుతారు.

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు:— మంత్రిగారు శ్రీమతి వైజయంతిమాల ఇచ్చిన perfomance ఒకసారి preside చేసారు, కాబట్టివారికి తెలిసివుండవచ్చు.

*The Madras Entertainments Act (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958.*

డాక్టర్ బి గోపాలరెడ్డి.—ఒక్కసారికాదు, చాలాసార్లు (నవ్వు)

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు——నిజంగా benefit performances చేసేవారికి exemption ఇవ్వడం ఎట్లా? ఈవిషయం మంత్రిగారు పరిశీలించాలని కోరుతున్నాను.

ఈ ప్రదర్శనం arange చేసిన వాళ్ళకు ఎలాగా? వారికి రెండు మూడు వందలు ఖర్చుఅవుతుంది అది చేతినుంచిపెట్టుకోండి అంటే కష్టంగా ఉంటుంది. కాబట్టిదానిని తమరు గమనించాలని కోరుతున్నాను.

"That the entertainment is wholly or partly educational, cultural or scientific in character and is provided by an institution not conducted or establised for profit."
అని వుంటే బాగుంటుంది.

Therefore, sub-cluse (c) can be retained and if sub-clause (d) is deleted, it will meet my objection.

డ్రామాలు, డేన్సులు, ఇవన్నీకూడా సినిమాలు వచ్చినతరువాత చాల తగ్గిపోయినవి. వాటిని ఉన్నింటినీ, మళ్ళా వృద్ధిలోకి తేవాలంటే, ఈవన్నులు కొంచెం నిరోధం అని కొంతమంది బాధపడుతున్నారు. కాబట్టి ఈ clause "C" మాత్రంపెట్టిమిగతాది తీసివేస్తేబాగుంటుందని నాకుతోస్తోంది. దానిని గమనించాలి.

తరువాత inspection విషయంలో " while the entertainment is proceeding at any reasonable time," అన్నారు. I don't understand what is intended by that.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:—అదేమంటే, సినిమాజరుగుతున్న సమయంలో 1 st class లో ఎంతమంది కూర్చున్నారో తెలియడానికి వీలు అవుతుంది. Intervel లో రావలి. లేక అంతా అయినతరువాత రావాలంటే చాలాకష్టం. Therefore the officer may come and see actually how many tickets are sold or he has allowed any complimentaries.

Entertainment Tax లేకుండా, వాళ్ళ దగ్గరనుండి డబ్బు తీసుకొని కూర్చోబెట్టినప్పుడు అటువంటివాళ్ళను check చెయ్యడానికి ఏదైనా అధికారంఉండాలి కదా?

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు :— అధికారం ఉండకూడదని నేను చెప్పడంలేదు. "while the entertainment is proceeding, at any reasonable time' అనేదానికి అర్థం ఏమిటో నాకు బోధపడ్డం లేదు. అంటే entertainmet జరుగుతున్నప్పుడు audience ను లెమ్మని, కూర్చోమని చెప్పవచ్చునా?

*The Madras Entertainments Act (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958.*

డాక్టర్ బి. గోపాలరెడ్డి:— డ్రామా అంతా అయిపోయినతరువాత అందరూవెళ్ళి పోతూంటే మీరంతా కూర్చోండి, నేను check చెయ్యాలంటే, ఏమిబాగుంటుంది.

*Sri R. B. Ramakrishna Raju.* Who is there to say which is reasonable ?

*Dr B. Gopala Reddy:* Then how does he want to amend it ?

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు:— Entertainment జరుగుతున్నప్పుడు మధ్యనవాడు వచ్చి can he disturb the audience. While the entertainment is proceeding, can an officer disturb the congregation without interfering with the entertainment? It would not be right that he should come at that stage. Let him come and examine at intervals ?

డాక్టర్ బి. గోపాలరెడ్డి:— Entertainment జరుగుతుంది. కాబట్టి officers ను ward off చేసుకోవడానికి వారు ప్రయత్నిస్తారు. They will keep on doing something and prevent him for all time to come. Otherwise when is he to enter the hall ?

*Sri R.B. Ramakrishna Raju:* You had better consider whether such a thing will not interfere with the entertainment. The officer may come and inspect, but he should not interfere with the entertainment. That is what I mean.

ఇప్పుడు ఈ integeration లో ప్రస్తుతం మనదగ్గర వున్నటువంటిTax అక్కడి వారిపై వేస్తున్నామని చెబుతూ వచ్చారు. ఇప్పుడు వారి Tax మన మీద వేస్తున్నారు అనగా 2/రూ, ఉన్నది 5/—రూ. అవుతుంది. 3/—రూ., ఉన్నది, 4/8 రూ, అవుతుంది. ఒక్క రూపాయి ఉన్నది, 2/— రూ, అవుతుంది, ఇది ఏదోవినోదాలపై పన్నుకాబట్టి కొంచెంజాస్తీగావేసినా ఫరవాలేదు. మన తెలంగాణా సభ్యులు దీనిని అంగీకరిస్తే చాలా బాగుంటుంది. నేనుకూడా సంతోషిస్తాను. కాని ప్రభుత్వం ఈ act ను అనువర్తింపచేసినపుడు మాసందేహాలను చక్కగాపరిశీలిస్తుందని ఆసిస్తున్నాను.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు :— అధ్యక్షా, మంత్రిగారు ఈ బిల్లును Select Committee కి refer చెయ్యాలని Move చేస్తు, దీనిలో కొత్తవిషయం ఏమీలేదన్నారు. ఈ చట్టం ప్రకారం ఆంధ్రలో 3—రూపాయలనుంచి, 5—రూపాయలకు ఎక్కువచెయ్యడం ఆంధ్రకుకొత్తవిషయమే. అదేవిధంగా $12\frac{1}{2}\%$—,25%,$33\frac{1}{3}\%$, ఇక్కడ పెంచడం తెలంగాణాకు కొత్తవిషయమే. Act లో, Administrative difficulties చాలావున్నాయి, వాటిని, సవరించవలసిన అవసరంవుంది. ఊరికే Act లు pass చేసి, ఆదాయం ఎక్కువ వస్తుందని, పన్నులువెయ్యడం సరియైనపద్ధతికాదు. ఈతెలంగాణా చట్టాన్ని ఆంధ్రలో వర్తింపచేస్తే, నా Rough Calculation ప్రకారంగా, ఆరు లేక ఏడు లక్షల రూపాయలవరకు రావచ్చు.

*The Madras Entertainments Act (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958.*

డాక్టర్ బి. గోపాలరెడ్డి:—నాలెక్కల ప్రకారం 3.85 లక్షలు వస్తుంది

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు:—పోని average గా 4 లక్షలు వేసుకోండి మేము Rough గా Calculate చేస్తాము కాబట్టి రెండులక్షలు ఎక్కువవేసేము. ఏమైన ప్పటికీ, ఇక్కడ 12½% Tax వసూలు చేసు న్నటువంటి దానిని, మూడు వంతులకుపెంచడం జరుగుతున్నది. అనగా 33⅓% కు పెరుగుతుంది Integration చెయ్యడం అంటే అక్కడ ఎక్కువవుంటే ఇక్కడవెయ్యడం, ఇక్కడఎక్కువవుంటే అక్కడవెయ్యడం, అనే సూత్రంమీద intigrate చెయ్యకుండా ఏదో, అక్కడిదీ, ఇక్కడిదీ కలిపి average గా కొంచెంతగ్గించి సమన్వయ పరిస్తే బాగుంటుంది.

ప్రజలందరూ, గోపాలరెడ్డిగారు పన్నులు ఎక్కువవెయ్యడానికి పడకొండవ అవతారంలాగ అవత రించారని అభిప్రాయ పడుతున్నారు. అందువల తేలికగా, ఎంతోకొంత పన్ను వేసేస్తే సరిపోతుంది అనే దృష్టితో మాత్రం వెయ్యకూడదని స్పష్టి చేస్తున్నాను. అక్కడ, ఈ Tax వసూలు చెయ్యడంలో పంచాయతీలకు అధికారంవుంది. అందున వాళ్ళు ఏవిధంగా Mischief చేస్తున్నారో చూస్తూనే ఉన్నాము. అవన్నీకూడ గోపాలరెడ్డిగారిచెవిలో పడేవుంటాయి. వాటిని నివారించడానికి ఆలోచించకుండా, ఈ Tax ను హనుమంతునితోకలాగు పెంచుకుపోతే ప్రయోజనం ఏమీ వుండదు.

Tax పెరిగినకొద్దీ evasion ఎక్కువ కావడముఖాయము. పావలా టిక్కెట్టు మంచి, రూపాయిన్నరవరకు, ఈ evasion జరుగుతున్నది. ఈవిషయంలో మేము చెప్పినమార్గాలు వచ్చినప్పుడు, పోనీ Department వాళ్ళతోనైనా చర్చించి, evasion జరగకుండా ఉండే మార్గాలు ఆలోచించాలని కోరుతున్నా. పెద్ద పెద్ద Municipality లు ఉన్నచోట వాటి అజమాయిషీ క్రింద మీ Department ను ఎందుకు పెట్టకూడదో నాకు అర్థంకావడంలేదు. అచ్చగా పంచాయతీలకు ఈ అధికారం ఇస్తే ఏమవుతుందో అనేభయంవుండ వచ్చు. అలాంటప్పుడు మీ Department వారిని అక్కడపెట్టి వారిపై పంచాయతీ President కో, లేక executive officer కో Check చెయ్యడానికి వీలు కలిగిస్తే కొన్ని ఒడుదుడుకులను సరిదిద్దడానికి అవకాశంవుంటుంది. అందువల్ల దీనిని Select Committee కి పంపించి పన్నులుపెంచడమే ప్రధాన ఉద్దేశ్యంగా భావించకుండ, వారి అభిప్రాయం తెలుసుకొని చట్టాన్నివవరించాలని కోరుతున్నాను. అంతేకాకుండ, చిన్నచిన్న classes మీద exempt చేసి 1—8—0 అంతకుపై classes మీద ఎక్కువ విధించినప్పటికీ, ఆస్థాయిలో వెళ్లేవా రందరూ భరించగలరు. ఆంధ్రలో ఈ entertainment tax వల్ల 63 లగా యతు 67 లక్షలరూపాయలు వసూలవుతున్నట్లు మన Budget లో ఉంది. తెలంగాణాకూడా కల్పుకుంటే ఇంకా ఎక్కువ వసూలు అవుతుంది.

తరువాత ఆవచ్చినటువంటి దానిలో 20% administrative Charges క్రింద, Collection Charges క్రింద పోయినట్లు వున్నారు.

*The Madras Entertainments Act (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958.*

డాక్టర్ బి. గోపాలరెడ్డి:— administrative Charges అని అనలేదు. 10% Collection charges అనేది మొదటనుంచీ అలాగేఉంది.

ఈ Collection Charges మేరకు 10% కాదు. 3% కన్నా ఎక్కువరాదని Government వారు, corporation వారు, చర్చించుకోవడం జరిగింది. దాని మీద Madras Corporation వాళ్ళు deputation తీసుకువచ్చారు. మన నరసింహంగారు అప్పుడు commissioner గా ఉన్నారు. ఆ తరువాత " collection charges " అనేమాటను act లో నుంచి తీసివేసాము. అప్పటినుంచి "10% will be deducted" అనివుంది. అదియిప్పుడు 20% అయినది. కాబట్టి "Collection charges" అనేమాటలేదు అక్కడ.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు:—మొదటిచట్టములో 10% అని ప్రచురించినారు. అడ్మిని స్ట్రేటివ్ ఖర్చుల క్రింద ప్రభుత్వమునకు ఎంతవచ్చింది. ?

Dr. B Gopalareddy :- Let Government have 10% of the income

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు:— ఇప్పుడు బడ్జెట్ ఎస్టిమేట్సులో వేసినది "20 of the income" అంటే 63 లకలా ?

మిస్టర్ స్పీకర్:— మీరుసెలక్టు కమిటీలో ఉండబోతున్నారు. అక్కడదీర్ఘముగాచర్చింప వచ్చును.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు:—బడ్జెటుమెమోరాండములో 63 లక్షలు అన్నారు. 20% ప్రభుత్వంతీసుకుంటుందంటే 63 లక్షలా?

డాక్టర్ బి. గోపాలరెడ్డి:—కాదుకాదు. ముందు మేము ఆదాయము అంతా చూపించి తరువాత ఖర్చు చూపించాము. 63 లక్షలు అంటే 20% కాదు.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు:— ఈలావాదేవీలవల్ల ప్రభుత్వమునకు 10,12 లక్షల్సు వస్తుందన్నమాట. ఏది ఏమైనా సరే ఈ డబ్బు విషయాలన్నీ సెలక్టులు కమిటీలో ఆలోచించాలి. గోపాలరెడ్డిగారు ఏమైనా ఎక్కువ చెయ్యవలెను అనే ఉద్దేశముతో చేస్తే బాగాఉంటుంది.

డాక్టర్ బి. గోపాలరెడ్డి :—అధ్యక్షా, ఇప్పుడు అట్టే ఎక్కువ అభ్యంతరములు చెప్పనందుకు అందరిని అభినందిస్తున్నాను. ఏదోసెలక్టు కమిటీలో ఆలోచించవలెనని చెప్పినారేకాని విర్మాణాత్మకముగా Show Tax ఎక్కువగావున్నది,తగ్గిస్తే బాగా వుంటుందనిగాని, దామాషాగా 5 ను 3 చేస్తే బాగావుంటుందని 3ను2 చేస్తె బాగావుంటుందని గాని ఎవరూచెప్పలేదు.

శ్రీ ఎల్లమందారెడ్డిగారు మాత్రం దామాషాగా మధ్యస్తంగా చేస్తే బాగావుంటుందన్నారు. అంతేగాని ఇదమిద్ధంగా ఎవరూ ఏమీచెప్పలేదు. 5 ను 3 అనిగాని, 3 ని 2 చెయ్యాలని గాని ఎవరూచెప్పలేదు.

*The Madras Entertainments Act (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958.*

శ్రీ జి. ఎల్లమందారెడ్డి:—బీద ప్రజలు కాబట్టి క్రింది క్లాసులకు ఏదైనా తగ్గించవలెనని చెప్పినాము.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:— సరే అదొకటి. ఆ విషయము ఆలోచించవచ్చును. ఇందులో exclusive income లేదు. కష్టమర్సుకు కొంతలాభముగా ఉంటుంది. మేముదీనిని examine చేసినాము. నాకుతెలుసును. రామకృష్ణరాజుగారికి అర్థంకాలేదు. ఆ విషయము excess వస్తుంది. ఈనాడు ఆంధ్రలోవున్న డ్రామాలకు, సంగీతసభలకు భరతనాట్యాలకు అక్కడవున్నది ఇక్కడలేదు. ఇది మ్యునిసిపల్ విషయము కాబట్టి కార్పొరేషన్ వారు ఇవ్వవచ్చును, ఈ exemption.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు:— మ్యునిసిపాలిటీలకు అధికారమువున్నది గాన గవర్నమెంటు ఆర్డరు క్రింద చేస్తే బాగావుంటుంది.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:— సికింద్రాబాదు మ్యునిసిపాలిటీ ఒప్పుకోవవచ్చును. హైదరాబాదు ఒప్పుకొనకపోవచ్చును. వరంగలు ఒప్పుకోవచ్చును, ఆంధ్రలో యికమీదట డ్రామాలకు సంగీత సభలకు భరతనాట్యాలకు exemption ఇచ్చుటకు ప్రభుత్వానికి అధికారము వస్తుంది. ఆంధ్రలోవున్న డ్రామాలు వగైరాల మీద ఉన్న exemption తెలంగాణాకు కూడ వస్తుందని ఆశిస్తున్నాను. కళలకు ప్రోత్సాహం వస్తుందని నేను అనుకుంటున్నాను. Show tax ఎక్కువగావున్నదని అన్నారుగాని entartainment tax ఎక్కువగావున్నదని ఎవరూ చెప్పినట్టు జ్ఞాపకములేదు. Definite suggestion చేసినట్లులేదు. ఏమైనా సెలక్టుకమిటీలో ఆలోచించుకొనవచ్చును. 20 తారీఖులోపున పూర్తిచేస్తే అక్టప్యానయి ఏప్రిలు 1 వ తారీఖున అమలులోనికి వస్తే బాగావుంటుంది.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు:— మీరు 20 వతేదీ అంటే కొన్ని చిక్కులువున్నవి. తారీకు fix చెయ్యవద్దని నాఉద్దేశ్యము.

మిస్టర్ స్పీకర్:— 20 రోజులువుంది. మధ్యాహ్నంకూర్చుంటే సరిపోతుంది కాసేపు నాలుగు రోజులుకూర్చుంటే అయిపోతుంది.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు :— 25 కు పెట్టండి.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:— 20th న బాగుంటుంది.

*Mr. Speaker :* The question is .

"That the Madras Entertainments Tax (Andhra Pradesh Extension and amendment) Bill, 1958 be referred to a select Committee consisting of the following members:

1. Dr. Gopal Reddy.
2. Sri K. Brahmananda Reddi.
3. Sri Rehmatulla Saheb.

*The Madras Entertainments Act (Andhra Pradesh Extention and Amendment) Bill, 1958.*

4. Sri A. C. Subba Reddy.
5. Sri RamaswamiReddi.
6. Smt. Kankaratnamma.
7. Smt. Vani Ramana Rao.
8. Sri Shahabuddin Saheb.
9. Smt. Sadalakshmi,
10. Sri D. Gopal Rao.
11. Sri Ranganatha Rao, B.
12. Sri Pillalamarri Venkateswarlu.
13. Sri K. L. Narasimha Rao.
14. Sri Jagan Mohan Reddi
15. Sri M. Satyanarayana Raju.

with instructions to submit the report on or before the 20th March, 1958."

The motion was adopted.

*Mr Speaker:* I nominate Dr B. Gopala Reddi as Chairman of the Select Committee.

The House then adjourned till Half Past Eight of the Clock on Saturday, the 1st March; 1958.

---

